# సోవియట్ సమీక్ష




ఆత్మ - పునర్జన్మ

సోషలిస్టు దేశాల్లో మానవ హక్కులు

సోవియట్, అమెరికాల మధ్య శాంతియుత సహజీవనం

పెరిస్త్రోయికా ధ్యేయం: ప్రయోజనాల సమరససాధన

సోవియట్ - అఫ్గన్ సంయుక్త ప్రకటన

# సంబంధాలు








నార్వేకు చెందిన ప్రముఖ శాస్త్రవేత్త థోర్‌హెయెర్డాల్ (ఎడమ నుండి రెండవ వ్యక్తి) మాస్కోలో సోవియట్ ఆర్టిస్టుజడ్. చెర్నోవ్ స్టుడియోలో (ఎడమ నుండి మొదటివ్యక్తి)

మహాత్మాగాంధీకి అంకితం చేసిన తన కృషిని ఆధునిక కళల భారత జాతీయ గ్యాలరీ క్యురేటర్ ఎస్.కె. సాహనీకి చూపెడుతున్న టర్కమన్ శిల్పి ఎం. సెయిత్ మర్దోవ్ (కుడి)

"దిగ్లాస్‌మేనేజరియ్" అనే టెన్నిస్ విలియమ్స్ రచన ఆధారంగా లెనిన్ గ్రాడ్‌లో ఒక ప్రదర్శన యివ్వనున్న అమెరికన్ ఫిలిం డైరెక్టర్ జాక్సన్ నాకొహెల్ (మధ్య)

# సోవియట్ సమీక్ష

5

సంపుటి 22

మే

1988

సంపాదకుడు :
వై. ఎల్. ఫ్రొలోవ్
సంయుక్త సంపాదకుడు :
జి. ఆళవందార్
సహాయ సంపాదకుడు
మునగాల జనార్దన రెడ్డి
ఆర్టిస్ట్
ఎల్. వి. గుషేవ

పుటలరూపరచన
వి. పల్యాకవ్

11 భారతీయ భాషల్లో వెలువడే పత్రిక

SOVIET SAMEEKSHA - (Telugu)


ఈ సంచికలోని చిత్రాలు, వ్యాసాలు
నొవొస్తీ వార్తా సంస్థవి

Printed by A.N.Kazantsev and Published by him at Soviet Nadu Office, 115, Theagaraya Road– Madras-600 017, (Phone:440201), for the Information Department of the USSR Embassy in India. Printed at Pavai Printers (P) Ltd., 142, Jani Jan Khan Road, Madras-600014.

మే ఒకటి శ్రామిక ప్రజల
అంతర్జాతీయ
సంఘీభావదినోత్సవం.
సైనిక పద్ధతుల్లో
యెలాటి వివాదాన్ని అయినా
పరిష్కరించు కోజాలమనే
ఎరుకనానాటికీ పెరుగుతున్న
వాతావరణంలో
దీన్ని యీ సంవత్సరం
పాటిస్తున్నారు.
2000 సంవత్సరం నాటికి
అణ్వస్త్ర రహిత
ప్రపంచాన్ని నిర్మించాలని
సోవియట్ యూనియన్
ప్రతిపాదించిన కార్యక్రమం
యీ భావనకు
సుస్పష్టమైన రుజువు.
ఐ.ఎన్.ఎఫ్ సంధిపై
సంతకాలు చేయడం ద్వారా
యీదిశలో మొదటి అంజ
వేయడం జరిగింది.
వ్యూహాత్మక ఆయుధాలను
సగానికి సగం తగ్గించడం తర్వాతి అంజ.
యేదేమైనప్పటికీ
ప్రపంచంలోని శ్రామిక ప్రజలు
తమ కృషిని కలబోస్తేనే
యీ కార్యక్రమం సంపూర్ణంగా
అమలు జరుగుతుంది.

# ఈ సంచికలో




సంపాదక పుట 4
నూతన వాస్తవాలతో
కమ్యూనిస్టుల ముఖాముఖి 5
గోర్బచేవ్ నజీబుల్లా సమావేశం 8
ప్రాధాన్యతలను
జీవితమే నిర్ణయిస్తుంది 10
సోవియట్‌యూనియన్ 12
అమెరికాల మధ్య
శాంతియుత సహజీవనం
ధ్యేయం - ప్రయోజనాల 17
సమరస సాధన
దేశవ్యాప్త పార్టీ సమావేశాలు 21
వేగనిరోధక యంత్రాంగాన్ని 24
తిప్పికొట్టడం ఎలా?
పెరిస్త్రోయికా పై సోవియట్ 27
ప్రజల అభిప్రాయాలు
మానవప్రాణం పవిత్రమైంది 29
వర్ధమానదేశాల సమస్యల
పరిష్కారాన్ని అడ్డుకొంటున్నదేమిటి? 32
వర్ధమానదేశాలూ, నూతన 35
అంతర్జాతీయ ఆర్థికవ్యవస్థ


## 38

## చరిత్ర గుణపాఠాలు

రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి. మూడవ ప్రపంచ యుద్ధ ప్రమాదాన్ని నివారించ వచ్చా? రెండవ ప్రపంచ యుద్ధ గుణపాఠాల నుండి నేర్చుకుంటే నివారించడం సాధ్యమే.



## 44

## ఆత్మ - మానసికత


దేశభక్త మహాయుద్ధంపై 42
మౌలికమైన నూతన గ్రంథం
స్థిరత్వం లోపిస్తున్న యుగం 48
సోవియట్ మార్కెట్‌లో 57
అపార అవకాశాలు
మహాత్మాగాంధి 60
టాగూరుగీతాంజలి 62
విమర్శగురించి 63
ప్రత్యేక సమాచారం, టూకీగా 64

53

కంపూచియా శాంతి, జాతీయ పునరుజ్జీవన పథంలో

56

రూస్ క్రైస్తవ మతానికి మారిన సహస్రాబ్ది వుత్సవాలపై మెట్రొపాలిటన్ ఫిలారెట్ వివరణ

ఇప్పుడు సోవియట్ పత్రికలు తమ దృష్టిని ప్రధానంగా అధికార్లపై, బ్యూరాక్రాట్‌లపై కేంద్రీక రిస్తున్నాయి. వారిపై తీవ్ర విమర్శల పరంపరను పత్రికా రచయితలు గుప్పిస్తున్నారు. గణాంక సమాచారాన్ని, గ్రాఫులను, రకరకాల చిత్రాలను తమ వాదనకు బలంగా ప్రచురిస్తున్నారు. బ్యూరాక్రాటిక్ పరిపాలన పద్ధతికి పట్టుజారుతున్న కొద్దీ అన్ని శ్రేణులు స్థాయిలలోని అధికార్ల సంఖ్య కుంచించుక పోక తప్పదు.

ఈ బ్యూరాక్రాట్లకు వ్యతిరేకంగా నిరసన భావం దశాబ్దాల తరబడి మన సమాజంలో పేరుకు పోయింది. ఇది సమర్థనీయమయిన నిరసనే. పత్రికలలోనూ బహిరంగ చర్చలోను ఒక అంకె పునః పునః దర్శనమిస్తూంటుంది. సోవియట్ యూనియన్‌లో 18 మిలియన్ల మంది అధికార్లున్నారు. బలమైన బలగమే! నాతోటి పాత్రికేయుడు యీ సంఖ్యను పది పెట్టి హెచ్చువేశాడు. ఒక్కొక్క బ్యూర క్రాట్‌పై ఆధారపడిన వారు, అతడి తాబేదార్లు, సగటున పది మంది చొప్పున వుంటారని ఆయన లెక్క. మొత్తం మీద ఆసంఖ్య 180 మిలియన్లు అని తేలింది. అంటే సోవియట్ యూనియన్‌లోని మొత్తం వయోజనుల సంఖ్యతో సమానం.

అయితే బ్యూరాక్రాట్ల గురించి మరింత గంభీరమయిన వైఖరిని అవలంబించాలంటే, అధికార్లు అందరూ బ్యూరాక్రాట్లు కారు అన్నవిషయం దృష్టిలో పెట్టుకోవాలి. వారిలో చాలా మంది సమర్థులైన పనివారున్నారు. తాము చూచే కాగితాల మంచుతెరలోంచి వాస్తవాలను కనుగొంటూంటారు.

అంతే కాదు, ఈ 18 మిలియన్ల (నిక్కచ్చి లెక్క చెప్పాలంటే 17,718,000) బ్యూరాక్రాట్లలో మంత్రులు, ఉప మంత్రులు, డైరెక్టర్లు, కేంద్ర కార్యాలయాల అధిపతులు తదితరులే కాక వివిధ కర్మాగారాది సంస్థలు, చిన్న చిన్న ఆఫీసులలోని మేనేజర్లు 11.5 మిలియన్ల మంది, వీరు గాక 3.5 మంది ఇంజనీర్లు టెక్నీషియన్లు యింకా డ్రైవర్లు, టైపిస్టులు, కంప్యూటర్ ఆపరేటర్లు, గార్డులు, చిన్న స్థాయిల అధికార్లుసంగతి చెప్పనే అక్కర్లేదు. మొత్తం అధికార్లలో అత్యున్నత స్థాయి అధికార్లు 14 శాతం మాత్రమే. వారు 100 కు పైగా జాతీయ స్థాయి మంత్రిత్వ శాఖలు, ప్రభుత్వ కమిటీలు కేంద్ర కార్యాలయాలను, యివి గాక రిపబ్లిక్ స్థాయిలో 800 కార్యాలయాలను నిర్వహిస్తున్నారు.

అంటే జాతీయ స్థాయిలో, స్థానిక స్థాయిలో వుండే అధికార్లు 14 మిలియన్ల మంది. మంత్రిత్వ స్థాయి నుంచి స్థానిక కర్మాగారాది సంస్థ స్థాయి వరకు వివిధ స్థాయిలలో వారు పని చేస్తున్నారు. సోవియట్ యూనియన్ వంటి అతి విశాల దేశంలో సైతం యీ సంఖ్య అతి ఎక్కువే.

అందువల్లనే పరిపాలనా యంత్రాంగాన్ని కోత బెట్టేందుకు ప్రణాళికా మంత్రిత్వ శాఖలు యితర కేంద్ర కార్యాలయాలలో సిబ్బందిని 30 శాతం తగ్గించడం జరుగుతుంది. ఒక్క మాస్కోలోనే ఒక లక్ష మందిని తగ్గించడం జరుగుతుంది. సగం మంది మేనేజర్లను ఖాళీగా వున్న వుద్యోగాలలోకి బదిలీ చేయ వీలుందని నిపుణులంటున్నారు. దేశం మొత్తంమీద పరిశ్రమల రంగంలోనే 7 లక్షల ఉద్యోగాలు ఖాళీగా వున్నాయి.

పత్రికలలో యీ వాస్తవాలను, లెక్కలను వుటంకిస్తున్నారు. అసలు యీ మంత్రిత్వశాఖలు ఎవరికి కావాలి అని ప్రశ్నిస్తున్నారు. పాశ్చాత్య దేశాలలో కేంద్ర కార్యాలయాలు చాలా తక్కువ వున్నాయి. అయినా వాటి పారిశ్రామిక పురోగతి బాగానే సాగుతున్నది గదా అంటున్నారు.

మరో బలమయిన అభిప్రాయం కూడా వుంది. మన రాజ్యం జాతీయ ప్రయోజనాలను వ్యక్తం చేస్తున్నది. అందువల్ల ఆర్థిక కార్యకలాపాల నిర్వహణ క్రమబద్ధీకరణ విధులకు అది కట్టుబడి ఉండాలి. జాతీయ ఆర్థిక అవసరాలను దృష్టిలో పెట్టుకొని ఆనిర్వహణా రూపాన్ని మాత్రం మార్చవలసి వుంటుంది.

సోవియట్ యూనియన్ ఆర్థిక మేనేజిమెంటులో అమలు జరుగుతున్న ప్రజాతంత్ర పరమయిన మార్పు పెరిస్త్రోయికాలో ముఖ్యమయిన భాగం. సోవియట్ జీవన సకల రంగాలలోనూ ఆర్థిక పునర్వ్యవస్థీకరణను, ప్రజాతంత్ర సంస్కరణలను అమలు పర్చడం పెరిస్త్రోయికా ధ్యేయం.

## ఆధునిక కాలంలో నూతన ఆలోచనా ధోరణి

# నూతన వాస్తవాలతో కమ్యూనిస్టుల ముఖాముఖీ

డా. గ్రిగరి వొదొలాజోవ్ [తత్వశాస్త్రం]

ప్రపంచ పరిణామంలోని ప్రస్తుత స్థితిని ఒక మలుపుగా సి.పి.యస్.యు. 27 వ మహాసభ విశ్లేషించింది. "నూతన వాస్తవాలు కర్తవ్యాలు సమస్యలు కమ్యూనిస్టు ఉద్యమానికి ముఖాముఖి ఎదురౌతున్నాయి. ఈ ఉద్యమం అభివృద్ధిలో గుణాత్మకంగా ఒక కొత్త దశలో ప్రవేశించిందని చెప్పడానికి సకల సూచనలూ వున్నాయి." అని మహాసభ పత్రాలు పేర్కొన్నాయి.

నిజమే కొత్త కర్తవ్యాలు, క్లిష్టమైన కర్తవ్యాలు కమ్యూనిస్టు ఉద్యమం ముందుకొచ్చాయి. ప్రపంచ ఉత్పాదక శక్తుల అభివృద్ధిలో పెద్ద ముందంజ వల్ల పరస్పర ఆధారితమూ ఘర్షణాయుతమూ అయినప్పటికీ చాలా వరకు అఖండంగా వున్న ప్రపంచ ఆవిర్భావం; శాస్త్ర-సాంకేతిక విప్లవం ప్రస్తుత దశ, దాని ప్రభావంవల్ల బూర్జువా సమాజంలో ఆర్థిక సంబంధాలలో సాంఘిక స్వరూపంలో వచ్చిన మార్పులు; పెట్టుబడి బహుళజాతి రూపం పొందడం; దోపిడిలో నయా వలస రూపాలు; ప్రపంచ సమస్యలు విషమించడం — యిలాటి అంశాలన్నిటినీ సైద్ధాంతికంగా అవగాహన పర్చుకోవాల్సి వుంది. అందువల్ల నూతన తరహా రాజకీయ ఆలోచనా ధోరణి, కమ్యూనిస్టు ఉద్యమ అభివృద్ధిలో నూతన దశలోకి ముందడుగు వేయడం, కొత్త సవాళ్లను ఎదుర్కొనేందుకు గాను పోరాటపు మొత్తం వ్యూహాన్ని ఆధునిక పర్చుకోవడం వంటి మౌలికాంశాలు యిందులో వున్నాయి.

కొత్త వాస్తవాల జాబితాలో అన్నిటికన్నా ముందున్నది శాంతి కోసం పోరాటానికి వర్గపోరాటానికి గల బాంధవ్యం.

---

**అదే సమయంలో శాంతి కోసం కృషి అన్నది వర్తమాన కాలపు సామాజిక పోరాటాల నుంచి విడివడి పోయిన ఒంటరి లక్ష్యంగా ఏమీ రూపొందడం లేదు. సామాజిక ప్రగతి కోసం సార్వత్రికమైన ఉద్యమం నుంచి యిది విడదీయరానిది. అంటే, ఆయుధ పోటీలో, అంతర్జాతీయ ఉద్రిక్తతలను నిలిపి ఉంచడంలో స్వప్రయోజనాలున్న అన్ని రాజకీయ సామాజిక బృందాలకు వ్యతిరేకంగా పోరాటం అని ముఖ్యంగా దీని అర్థం.**

---

అంతర్జాతీయ అణు యుద్ధం అనేది సాధ్యమే కాకుండా చేసేంత బలంగా విస్తృతమయిన శక్తులను కూడగట్టాల్సి వుంది. పెట్టుబడిదారీ విధానం మీద మాత్రమే ప్రపంచ విప్లవ శక్తులు జరిపే పోరాటం కన్నా మరింత విస్తృత పరిధిగల

పోరాటం యిది. అటు ప్రపంచ విప్లవక్రమంలోని శక్తులూ, యిటు శాంతికోసం కృషి చేస్తున్న అనేక కొత్త ప్రజాస్వామిక శాంతి ఉద్యమాలూ కూడా చేరి వుండే పరిధి యిది. సామాజిక, రాజకీయ సమస్యలపై ఆ రెండు తరగతుల శక్తుల మధ్యా ఎన్ని సైద్ధాంతిక విభేదాలున్నప్పటికీ శాంతి కోసం పోరాటం అనే ప్రధాన రణరంగంలో అవి కలసి వుండేట్లు చేయడం ఈ రోజున మరింత ముఖ్యాంశం.

అదే సమయంలో శాంతి కోసం కృషి అన్నది వర్తమాన కాలపు సామాజిక పోరాటాల నుంచి విడివడి పోయిన ఒంటరి లక్ష్యంగా ఏమీ రూపొందడం లేదు. సామాజిక ప్రగతి కోసం సార్వత్రికమయిన ఉద్యమం నుంచి యిది విడదీయరానిది. అంటే, ఆయుధ పోటీలో, అంతర్జాతీయ ఉద్రిక్తతలను నిలిపి వుంచడంలో స్వప్రయోజనాలున్న అన్ని రాజకీయ సామాజిక బృందాలకు వ్యతిరేకంగా పోరాటం అని ముఖ్యంగా దీని అర్థం.

## నూతన వాస్తవాలతో కమ్యూనిస్టుల ముఖాముఖి

అందువల్ల శాంతి కోసం పోరాటం, సామాజిక ప్రగతికోసం సామాజిక వర్గ కార్యకలాపాలను విప్లవీకరించడం కోసం పోరాటం ఈరెండు పోరాటాల మధ్య సరైన సమతూకం కోసం అన్వేషణ నేడు అతి ముఖ్యమైంది. ఆర్థిక వ్యవస్థను సైన్యీకరించడానికి వ్యతిరేకంగా పోరాటంలో యీ ఐక్యతను సంపూర్ణంగా సాధించవచ్చునని చాలా కమ్యూనిస్టు పార్టీలు భావిస్తున్నాయి.

పెట్టుబడిదారీ విధాన ప్రస్తుత అభివృద్ధిలోని కొత్త వాస్తవాలవల్ల యిప్పుడు సామాజిక వర్గ పోరాటంలో మార్పు వస్తున్నది. ఉత్పాదక శక్తులలో పెద్దముందంజ ఒక విశిష్ట లక్షణం. వని స్వభావం లోనే గాక ఉత్పత్తి సంబంధాలలో కూడా మార్పు లొస్తున్నాయి.

ప్రపంచ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిలో మార్పులు, అలాగే పెట్టుబడిదారీ దేశాలలోని జాతీయ ఉత్పాదక శక్తులలో మార్పులు వున్నప్పటికీ, శ్రామిక ప్రజల ప్రయోజనాల కోసం, వారి అజమాయిషీలో ప్రణాళికాబద్ధ సామాజిక వుత్పత్తి కోసం అంటే సోషలిజం కోసం పోరాటం అవసరమని యీకొత్త వైరుధ్యాలను మొత్తంగా పరిశీలిస్తూ కమ్యూనిస్టులు నిర్ధా

**ప్రపంచ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిలో మార్పులు, అలాగే పెట్టుబడిదారీ దేశాలలోని జాతీయ ఉత్పాదక శక్తులలో మార్పులు వున్నప్పటికీ, శ్రామిక ప్రజల ప్రయోజనాల కోసం, వారి అజమాయిషీలో ప్రణాళికాబద్ధ సామాజిక వుత్పత్తి కోసం అంటే సోషలిజం కోసం పోరాటం అవసరమని ఈ కొత్త వైరుధ్యాలను మొత్తంగా పరిశీలిస్తూ కమ్యూనిస్టులు నిర్ధారణకు వచ్చారు.**

రణకు వచ్చారు.

ఇది మౌలిక ప్రాధాన్యతగల నిర్ధారణ. సోషలిజం కోసం పోరాటాన్ని వదులుకుని పెట్టుబడిదారీ విధాన చట్రంలోపలే సామాజిక సమస్యలను పరిష్కరించేందుకు వత్తిడి చేయడంపై కేంద్రీకరించాలని ఆ మధ్య కొందరు అనడం వినిపించింది. పెట్టుబడి దారీ విధానం తన "మనుగడకు మూల బలాన్ని కనుగొంటోంద" నీ అందువల్ల సోషలిజం కోసం పోరాటం సుదూరం భవిష్యత్ ధ్యేయమైందనీ వారి వాదన. అయితే కమ్యూనిస్టులు అలా భావించడం లేదు. పెట్టుబడి దారీ ప్రపంచంలోని అతి పెద్ద కమ్యూనిస్టు పార్టీలు ఇటాలియన్ పార్టీ, ఫ్రెంచి పార్టీ తాము సోషలిజానికి కట్టుబడి వున్నట్లు నిర్ద్వంద్వంగా ప్రకటించాయి. యితర కమ్యూనిస్టు పార్టీలూ అదే వైఖరిలో వున్నాయి.

మొత్తం మానవాళి అంతా సమన్వయంతో కృషి చేయాల్సిన సమస్యలు, జాతీయ పరిధిలో పరిష్కరించడం సాధ్యంకాని సమస్యలు 1980 లలో ముందు కొచ్చాయి.

భూగోళం మీది సకల శాంతి శక్తుల మధ్య అంతర్జాతీయ సంఘీభావం, సన్నిహిత అంతర్జాతీయ బాంధవ్యం నెలకొల్పాలని కమ్యూనిస్టులు కోరుతున్నారు. ఆ శక్తులను అలా ఐక్యపరిచినట్ల యితే అది "శాంతి, హేతుబద్ధత, సుహృద్భావాల గొప్ప శక్తి" అవుతుందని సి.పి.యస్.యు. 27 వ మహాసభ పేర్కొంది. సోషలిస్టు దేశాలు, శాంతి వుద్యమంలోని యితర సామాజిక రాజకీయ శక్తులు చేసిన శాంతి ప్రతిపాదనలకు వుమ్మడి రూపం యిచ్చేందుకు మార్గాల్ని గురించి ఫ్రెంచి

## నూతన వాస్తవాలతో కమ్యూనిస్టుల ముఖాముఖి

కమ్యూనిస్టు పార్టీ 25 వ మహాసభ క్షుణ్ణంగా చర్చించింది. ఈ నూతన తరహా సంఘీభావం రూపసారాల గురించి అందులోని శక్తుల మధ్య బాంధవ్యం గురించి వర్తమాన కమ్యూనిస్టు ఉద్యమం శ్రద్ధగా పరిశీలిస్తోంది.

దేశాల ఆర్థిక పరస్పర ఆధారిత్వం వల్ల మానవాళి ముందు ముఖ్య కర్తవ్యాలు తలెత్తుతున్నాయి. అఖండమయిన పరస్పర బాంధవ్యాలు గల మానవ ఆస్తిగా పెరిగిన ఉత్పాదక శక్తులను పెట్టుబడిదారీ దేశాలలోని గుత్త పెట్టుబడి వర్గాల ప్రయివేటు ఆస్తిగా వినియోగించడం వల్ల ప్రపంచ ప్రజల ప్రాణాలకు ప్రమాదం ఏర్పడుతున్నది. ఈ ప్రమాదాన్ని తొలగించేందుకు ప్రజాతంత్ర, ప్రగతిశీల ఉద్యమాలు కలవాలని కమ్యూనిస్టులు కోరుతున్నారు. ఆర్థిక భద్రత సమస్యలపై చర్చకు ప్రపంచ మహాసభ ఏర్పాటు చేయాలని సోవియట్ యూనియన్ కోరింది.

అంతర్జాతీయ సంఘీభావంలోని యీ కొత్త రూపాలను కమ్యూనిస్టులకు సాంప్రదాయకమయిన కార్మిక వర్గ సంఘీభావం దృష్ట్యా ఎలా పరిగణించాలన్న ప్రశ్నకు కమ్యూనిస్టు పార్టీలు జవాబివ్వాల్సి వుంది. ఆ జవాబు క్లిష్టమైంది రెండు ధోరణులు ఆవిర్భవించాయి. శాంతి కోసం

**కార్మిక వర్గ ఉద్యమాల యుద్ధ వ్యతిరేక ఉద్యమాల అఖండ ఐక్యతను సాధించే కర్తవ్యాన్ని కమ్యూనిస్టు పార్టీలు నేడు నిర్దేశించుకుంటున్నాయి. తమ మిత్రులతో ఒక కొత్త పద్ధతిలో సంబంధాలను పెంచుకోవడంలో వాటి సామర్థ్యంపై ఆ కర్తవ్య పరిపూర్తి ప్రధానంగా ఆధారపడి వుంటుంది. సత్యం తమ గుత్తసొమ్ము అని దబాయించకుండా చర్చల ద్వారా తమ అభిప్రాయాలను సమర్థించుకోవడం, సంఘటనలలో తామూ చేరాలంటే తమకే నాయకత్వం యివ్వాలన్న షరతులు పెట్టకుండా వుడడం, ఇతరులకు బోధించడం మాత్రమే కాక యితరులనుంచి నేర్చుకోడానికి కూడా సిద్ధపడటం.**

కార్యాచరణ పరమపిలువగలదనే భావనతో, పెట్టుబడిదారీ దేశాలలో పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా ప్రత్యక్ష పోరాటానికి యింకా సమయం రాలేదని అందువల్ల ఆ పోరాటం నిలుపు చేయాలనే నిర్ధారణకు రావడం ఒక ధోరణి. సోషలిస్టు విప్లవం యీరోజుల్లో అతి ప్రాధానమైంది. అందువల్ల శాంతి కోసం పోరాటాన్ని యీ ప్రాధాన్య లక్ష్యానికి తగ్గట్టుగా సంధించాలి అన్నది రెండో ధోరణి. అందువల్ల కమ్యూనిస్టుల అంతర్జాతీయ వ్యూహానికి శ్రామిక వర్గ అంతర్జాతీయ సంఘీభావం కేంద్రకంగా వుండాలనీ, శాంతి కోసం పోరాటాన్ని "వర్గాలకు వెలుపలి" విషయంగాను, గౌణ విషయంగాను పరిగణించాలని రెండో ధోరణి వారి వాదన. ఈ రెండు వాదనలూ ఏకాక్షి పరమయినవే. శాంతి కోసం పోరాటానికి, సామాజిక ప్రగతి కోసం సోషలిజంకోసం పోరాటానికి సన్నిహిత సంబంధం వుంది. శాంతి కోసం పోరాటం అంటే బూర్జువా వర్గంలో అత్యంత అభివృద్ధి నిరోధకులైన సైనిక వాదులకు వ్యతిరేకంగా పోరాటం. అందువల్ల గుత్త పెట్టుబడి వ్యతిరేక బూర్జువా వైఖరులూ అంటే ప్రాధమికంగా సోషలిస్టు వైఖరులు అందులో వుంటాయి అలాగే అంతర్జాతీయ సంఘీబావపు సకల రూపాల మధ్య సంబంధం వుండాలి

కార్మిక వర్గ ఉద్యమాల, యుద్ధ వ్యతిరేక ఉద్యమాల అఖండ ఐక్యతను సాధించే కర్తవ్యాన్ని కమ్యూనిస్టు పార్టీలు నేడు నిర్దేశించుకుంటున్నాయి. తమ మిత్రులతో ఒక కొత్త పద్ధతిలో సంబంధాలను పెంచుకోవడంలో వారి సామర్థ్యంపై ఆ కర్తవ్య పరిపూర్తి ప్రధానంగా ఆధారపడి వుంటుంది సత్యం తమ గుత్త సొమ్ము అని దబాయించకుండా చర్చలద్వారా తమ అభిప్రాయాలను సమర్థించుకోవడం, సంఘటనలల్లో తాము చేరాలంటే తమకే నాయకత్వం యివ్వాలన్న షరతులు పెట్టకుండా వుండటం; ఇతరులకు బోధించడం మాత్రమేకాక యితరుల నుంచి నేర్చుకొడానికి కూడా సిద్ధపడటం.

కొత్త వాస్తవాల దృష్ట్యా కార్మిక వర్గ అంతర్జాతీయ సంఘీభావం యితర అంతర్జాతీయ వాద రూపాల విషయంలో నమ్యతను ప్రదర్శించాలి అదే సమయంలో కొన్ని విషయాలలో దృఢతరంగానూ ఉండాలి.

కమ్యూనిస్టు పత్రిక నుంచి సంక్షిప్తం

# మిహయీల్ గొర్బచేవ్ నజీబుల్లా సమావేశం

**సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహయీల్ గొర్బచేవ్, ఆఫ్గనిస్తాన్ రిపబ్లిక్ అధ్యక్షుడు, ఆఫ్గనిస్తాన్ పీపుల్స్ డెమోక్రాటిక్ పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి నజీబుల్లా 1988 ఏప్రిల్ 7 న తాష్కెంట్‌లో సమావేశమయ్యారు. యీ సమావేశం సోవియట్ ఆఫ్గన్ సంబంధాల్లో నూతన దశను ఆవిష్కరించింది. స్నేహ, సౌహార్ద వాతావరణంలో జరిగిన యీ సమావేశం లో ఒక సంయుక్త ప్రకటనను ఆమోదించారు.**

# సోవియట్ - ఆఫ్గన్ సంయుక్త ప్రకటన

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి మిహయీల్ గొర్బచేవ్, ఆఫ్గనిస్తాన్ రిపబ్లిక్ అధ్యక్షుడు, ఆఫ్గనిస్తాన్ పీపుల్స్ డెమోక్రాటిక్ పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి నజీబుల్లా 1988 ఏప్రిల్ 7 న తాష్కెంట్‌లో సమావేశ మయ్యారు. యీ సమావేశంలో పాల్గొన్నవారు:

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ పొలిట్‌బ్యూరో సభ్యుడు, సోవియట్ విదేశాంగ మంత్రి ఎద్వార్డ్ షెవర్డ్ నాద్జే, ఉజ్బెకిస్తాన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధమ కార్యదర్శి రఫీఖ్ నిషానవ్‌లు.

అంతర్జాతీయ పరిస్థితిలోని కీలక సమస్యలపై మిహయీల్ గొర్బచేవ్, నజీబుల్లాలు తమతమ అభి ప్రాయాలను వ్యక్తం చేసారు. వుభయ దేశాల ప్రయోజనాలతో ప్రత్యక్షంగా ముడివడివున్న తక్షణ సమస్యలను వారు వివరంగా పరిశీలించారు.

ఆఫ్గన నాయకత్వం నికరంగా అనుసరిస్తున్న జాతీయ సామరస్య విధానం; రాజకీయ పరిష్కారానికి సంబంధించిన సమస్యలపై దాని నిర్మాణాత్మ వైఖరి — యిదే ఆఫ్గన్ ప్రజల ప్రయోజనాలకు, వారి పొరుగు దేశాల ప్రజలందరి ప్రయోజనాలకు, మొత్తం ప్రపంచ ప్రజల ప్రయోజనాలకు అనుగుణంగావున్న సరైన పంధా అని వారు అభిప్రాయపడ్డారు.

సమానత్వం, పరస్పరగౌరవం, పరస్పర ప్రయోజనం, ఆంతరంగిక వ్యవహారాల్లో బేజోక్యం అనే సూత్రాల ప్రాతి పదికపై వుభయదేశాల మధ్య సంబంధాలను నిర్మించు కునే ప్రాచీన సంప్రదాయంపట్ల నాయకులిద్దరూ తమ ధృఢ విశ్వాసాన్ని ప్రకటించారు.

ఈ సమావేశంలో మిహయీల్ గొర్బచేవ్, నజీబుల్లాలు యీకింది అంశాలపై యేకాభిప్రాయానికి వచ్చారు:

మొదటిది: సోవియట్ యూనియనూ, ఆఫ్గనిస్తాన్ రిపబ్లిక్కూ 1988 ఫిబ్రవరి 8 న జారీచేసిన ప్రకటనలు కనుగుణంగా వ్యవహరిస్తాయి. అత్యంత క్లిష్టమైన ప్రాంతీయ ఘర్షణను రాజకీయంగా పరిష్కరించుకునే క్రమానికి యీ ప్రకటనలు కొత్త వూపు నిచ్చాయి; వీటి మూలంగా సంభాషణలను ఆచరణాత్మక పరిష్కార స్థాయిలో వుంచడానికి సాధ్యపడింది.

రెండవది: ఒప్పందాలు కుదరడానికి గల చివరి అడ్డంకులనేవి యీ సమస్య పరిష్కారంతో సంబంధమున్న వారందరి నిర్మాణాత్మక సహకారం వల్ల తొలగిపోయాయని సోవియట్ కమ్యూనిష్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధానకార్యదర్శి, ఆఫ్ఘనిస్తాన్ అద్యక్షుడూ అభిప్రాయపడుతున్నారు; యీ ఒప్పందాలపై తక్షణమే సంతకాలు జరగటం పట్ల సుముఖంగా వున్నారు.

ఐ.రా.స. ప్రధాన కార్యదర్శి, ఆయన వ్యక్తిగత ప్రతినిధి డీగోకార్డొవెజ్‌లు యీ విషయంలో నిర్వ హించిన పాత్రను వుభయపక్షాలూ తగువిధంగా అంచనావేశాయి.

జెనీవా ఒప్పందాలకు హామీదార్లుగా వుండడా నికి సోవియట్ యూనియన్, అమెరికాలు తమ సంసిద్ధతను తెలిపినందుకు ఆఫ్గన్ అద్యక్షుడు హర్షం వెలిబుచ్చారు.

మూడవది: పైన పేర్కొన్న ఒప్పందాలు అత్యంత స్వల్ప వ్యవధిలో కుదిరే పక్షంలో, 1988 మే 15 నుండి సోవియట్ సైన్యాల వుపసంహరణ ప్రారంభమై, యీ ఒప్పందాలు నిర్ణయించే గడువు లోగా వుపసంహరణ పూర్తికావాలనే ఆఫ్గనిస్తాన్ - సోవియట్ యూనియన్ అంగీకారం చెల్లుబాటులో వుంటుంది.

నాల్గవది: జాతీయ సామరస్య విధానం అనేది ఆఫ్ఘనిస్తాన్ చుట్టువట్లగల పరిస్థితిని చక్కదిద్దు తుంది; యుద్ధాన్నీ భాతృహత్యాకాండనూ పరి సమాప్తి చేస్తుంది; దేశమంతటా శాంతిని స్థాపి స్తుంది; ప్రస్తుతం ఒకదానితో మరొకటి తలపడుతు న్న శక్తులతో సహా ఆఫ్గన్ సమాజానికి ప్రాతినిధ్యం వహిస్తున్న శక్తులన్నిటి భాగస్వామ్యంతో మిశ్రమ ప్రభుత్వాన్ని నెలకొల్పుతుంది.

ఐదవది: ఇతరదేశాల మధ్య తమదేశ ప్రతిపత్తి యేమిటో నిర్ణయించేది ఆఫ్గన్ ప్రజలేతప్ప మరొకరు కానే కాదు. ఆఫ్ఘనిస్తాన్ ఒక స్వతంత్ర, అలీన, తటస్థ రాజ్యమని ఆ దేశాధ్యక్షుడు నజీబుల్లా చేసిన ప్రకటనకు సోవియట్ యూనియన్ తన మద్దతును పునరుద్ఘాటిస్తోంది. ఆఫ్గనిస్తాన్ పొరుగున వున్న దేశాలతో సత్సంబంధాల, సహకార విధానాన్ని కొనసాగిస్తుందనే, ఆ దేశ భూభాగాన్ని దాని పొరు గుదేశాల ప్రయోజనాలకు వ్యతిరేకంగా వినియో గించుకోనివ్వదనే అభిప్రాయంతో సోవియట్ యూనియన్ యీ మద్దతు ప్రకటించింది. యిది సోవియట్ యూనియన్‌కూ, చైనా ప్రజారిపబ్లిక్కు కూ, భారత రిపబ్లిక్కుకూ, పాకిస్తాన్ ఇస్లామిక్ రిపబ్లిక్కుకూ సమానంగా వర్తిస్తుంది. ఆఫ్గనిస్తాన్ ఆంతరంగిక నిర్మాణం రాజకీయరంగంలో బహుళ పార్టీ వ్యవస్థపై, ఆర్థికరంగంలో బహుళరంగాల ప్రాతిపదికపై ఆధారపడి వుంటుందని ఆఫ్గన్ అధ్యక్షుడు చేసిన ప్రకటనను సోవియట్ పక్షం బలపరుస్తోంది.

ఆరవది: ఇప్పుడు తాత్కాలికంగా పాకిస్తాన్‌లో, యితరదేశాల్లో గల ఆఫ్గన్ శరణార్థులు తిరిగిరావ డానికై సముచిత పరిస్థితులను సృష్టించడం, వారికి దేశంలోని యితరపౌరులతో సమానంగా హక్కులను సమకూర్చడం జాతీయ సామరస్య విధానాన్ని అమలు జరిపేందుకు ఎంతో ముఖ్య మైన విషయం. అలాంటి పరిస్థితులను సృష్టించ డంలో ఆఫ్గనిస్తాన్‌కు సోవియట్ యూనియన్ సహాయం చేస్తుంది.

ఏడవది: ఆఫ్గనిస్తాన్‌తో గల సాంప్రదాయిక, చారిత్రక మైత్రీ సంబంధాలను దృష్టిలో పెట్టుకుని ఆ దేశ ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించడానికి, ఆఫ్గనిస్తాన్ రిపబ్లిక్కు ఆర్థిక, సామాజిక అభివృద్ధికి దోహదం చేయడానికి ఆఫ్గనిస్తాన్‌తో వున్నత స్థాయిలో సహకరించేందుకు సోవియట్ యూనియన్ తన సంసిద్ధతను ప్రకటిస్తోంది.

ఎనిమిదవది: ఆఫ్గనిస్తాన్‌లో శాంతి, జాతీయ సామరస్య స్థాపనకు సహకరించాలనీ, జెనీవా ఒప్పందాలను గౌరవించాలనీ ప్రధానకార్యదర్శీ, అధ్యక్షుడూ యితర దేశాలకు విజ్ఞప్తి చేశారు. యిది యితర ప్రాంతీయ ఘర్షణల పరిష్కారానికి చక్కని, ప్రోత్సాహకరమైన ఆదర్శాన్ని నెలకొల్ప గలదు.

(టాస్, ఏప్రిల్ 7, 1988 )

# ప్రాధాన్యతలను జీవితమే నిర్ణయిస్తుంది



సోవియట్-అమెరికా సంబంధాలపై సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీకి చెందిన అమెరికా, కెనడా విషయాధ్యయన సంస్థ డైరెక్టర్ అకడమీషియన్ గియోర్గి అర్బతోవ్ అభిప్రాయాలు.

ప్ర: వాషింగ్టన్ శిఖరాగ్ర సమావేశాన్ని జయప్రదం చేసిన నిర్ణయాత్మక అంశాలేమిటి?

జ: నమ్మఖీనతా విధానానికి భవిష్యత్తు లేదని పలువురు అర్థం చేసుకోవడం వల్ల 1970 దశాబ్దాంతపు రోజుల్ని 1980 దశాబ్దారంభం నాటినీ కీలక కాలం అనవచ్చు. తొలుత మితవాద ధోరణికి, తీవ్ర అభివృద్ధి నిరోధక ధోరణికి సైతం నాయకత్వం వహించిన రీగన్ తనకు ఇష్టం లేకున్నా అంతర్జాతీయ పరిస్థితిలో "సానుకూల" అంశాన్ని ప్రవేశ పెట్టారు. ఆయన విధానం ప్రచ్ఛన్న యుద్ధం, సైనిక తత్వాలకు గల మౌలిక రాజకీయ, మానసిక మూలకారణాలను బట్టబయలు చేసింది. మనం సదా శాంతికై అందోళన చేస్తూనే ఉన్నాం. కాని, ప్రస్తుత పునర్వ్యవస్థీకరణ, నూతన ఆలోచనా సరళి, కూడా మన విదేశాంగ విధానంపై ప్రభావం నెరిపాయి. బాహాటత, ప్రజాస్వామ్యాల అభివృద్ధి, మన విజయాలు, సమస్యల వట్ల చిత్తశుద్ధితో కూడిన మన వైఖరీ, దేశంలో విప్లవాత్మక పరివర్తనలు—ఇవి, సంభాషణల్లో మన భాగస్వామి అయిన అమెరికా దృష్టిలో మన దేశ ప్రతిష్ఠను పెంచాయి. గతంలో ప్రతిష్టంభనలో పడినట్లు కనిపించిన అనేక అంతర్జాతీయ సమస్యల విషయంలో నూతన వైఖరులను, నూతన మార్గాలను కనుగొనడం జరిగింది. ఈ అంశాలు, వీటికి తోడు జెనీవా, రక్యావిక్ సమావేశాలు, అణుపరీక్షలపై మన యేక పక్ష మారటోరియం, తదితర ప్రధాన శాంతి చొరవలు మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలన సంధి కుదుర్చుకోవడానికి వీలు కల్పించాయి. ఈ సంధి పత్రానికి సైనిక, రాజకీయ దృష్ట్యా పెద్ద ప్రాముఖ్యం ఉంది. ప్రస్తుతమున్న రాజకీయ వాస్తవాల వట్ల తన వైఖరిని అమెరికా మౌలికంగా మార్చుకోగలదని వాషింగ్టన్ శిఖరాగ్ర మహాసభ స్పష్టంగా నిరూపించింది. ప్రచ్ఛన్న యుద్ధ నిరాకరణ, ఆయుధ పోటీల పైనా, వరస్పరం ఆధారపడిన సున్నితమైన ఈనాటి ప్రపంచంలో ప్రవర్తించ వలసిన తీరు పైనా మన ప్రతిపాదనలను అమెరికా పక్షం సరిగా అవగాహన చేసుకుంది.

ప్ర: ఈనాటి సంధిపై సంతకాలకు అమెరికా

లోని సార్వత్రిక ప్రతిస్పందనను సానుకూలమైనదిగా పరిగణించవచ్చా?

జ: ఎంత మాత్రమూ అలా అనుకోలేము. వాషింగ్టన్ శిఖరాగ్ర సమావేశ ఫలితాలు అమెరికా మితవాదులను కలవరపెట్టాయి. అధ్యక్షుడు రీగన్ అధికారంలోకి రావడంవల్ల మితవాదులు తమస్థావరాలను గట్టి పర్చుకున్నారు. రిపబ్లికన్ పార్టీ యంత్రాంగాన్ని తామేనడప సాగారు. ప్రస్తుతం వీరి స్థానాలకు ప్రమాదం ఏర్పడింది. అమెరికా ప్రభుత్వానికి కూడా ఇబ్బంది కలుగుతోంది. ప్రపంచంలో యుద్ధానంతరం అమెరికా అనుసరించిన వైఖరికి గల పునాది బీటలు వారుతోంది. మితవాదులు తమ స్థావరాలను రక్షించుకునేందుకు సరికొత్త దాడులు కూడ బహుశ జరపవచ్చు.

మనం చిత్తశుద్ధితో కూడిన విధానాన్ని అనుసరిస్తాము. అమెరికాను ఇబ్బందిలో పెట్టాలని మనకు లేదు. సోవియట్ యూనియన్‌తో అవగాహనకు అమెరికా ప్రయత్నిస్తే (మన ప్రతిపాదనల ప్రాతిపదిక పైననే ఇది జరగాలనేమీ లేదు) ఆయుధ పోటీ ఆగిపోతుంది. శత్రుత్వం, అపనమ్మకాలు నిర్మూలన మవుతాయి. ముట్టడికి లోనైన శిబిరంలో ఉండాలని ఎవరూ కోరుకోరు. అవసరం లేక పోయినా సరే, రక్షణకోసం బిలియన్ల కొద్దీ డాలర్లను కేటాయించాలని ఎవరూ కోరుకోరు. లోగడ పాశ్చాత్య ప్రపంచం సోవియట్ సైనిక ప్రమాదం ఉందని నమ్మి, ప్రచ్ఛన్న యుద్ధవిధానాన్ని అనుసరిస్తుండేది. ప్రస్తుతం ప్రచ్ఛన్న యుద్ధ సిద్ధాంతాలను వారు పునఃపరిశీలిస్తున్నారు. అయితే, ఈ క్రమం నిలకడగా ముందుకు సాగుతుందని నమ్మడం కష్టమే అయినా ఇది తప్ప మరో మార్గం లేదు.

**ప్ర: నిరాయుధీకరణ క్రమం వ్యూహాత్మక దాడి ఆయుధాలను 50 శాతానికి తగ్గించడంతో ఆగిపోతుందని కొందరు పరిశీలకుల అభిప్రాయం. దీన్ని గురించి మీరేమను కుంటున్నారు?**

జ: నిరాయుధీకరణ, వ్యూహాత్మకదాడి ఆయుధాల్లో 50 శాతం తగ్గించడంతో ఆగిపోదు. ఈ తగ్గింపు అంతర్జాతీయ పరిస్థితిని మౌలికంగా మార్చివేస్తుంది. ఇతర అణ్వస్త్ర రాజ్యాలు కూడా ఈ క్రమానికి దూరంగా ఉండలేవు. శాంతి ప్రచారం, క్లిష్ట ఆర్థిక సమస్యలు కూడా ముఖ్యపాత్ర నిర్వహించనున్నాయి. యుద్ధమూ, శాంతి సమస్యల పట్ల అభిప్రాయాలు కూడా గణనీయంగా మారిపోయాయి. రాజకీయ సమస్యలకు పరిష్కార మార్గం యుద్ధం కాదని స్పష్టమైంది. దేశాలు ఒకదానిపై మరొకటి ఆధారపడటం పెరిగిందనేది కూడా సుస్పష్టమైన వాస్తవమే. ఉదాహరణకు, చెర్నొబిల్ అణ్విద్యుత్కేంద్రంలో జరిగిన ప్రమాదం యూరప్ అంతా మార్మోగి పోయింది.

**ప్ర: వ్యూహాత్మక దాడి ఆయుధాలను పెంపొందించడం అనేక సాంకేతిక, సైద్ధాంతిక సమస్యలతో ముడిపడి ఉంది. నిరాయుధీకరణ రంగంలో భావి అవకాశాల దృష్ట్యా ఈ విషయమై మీరేమైనా చెప్పగలరా?**

జ: ప్రపంచ భావి రాజకీయాలు వాతావరణ సూచనల వంటివి కావు. వాతావరణ సూచకులు వాతావరణాన్ని ప్రభావితం చేయలేరు కాని ప్రపంచ రాజకీయాల్లో భావిఘటనలను ప్రాభావితం చేయవీలుంది. ఉదాహరణకు, కొద్ది కాలం క్రితం కన్నా యిప్పుడు సాంప్రదాయిక ఆయుధాలను తగ్గించడం ఆచరణ సాధ్యమవుతోంది. పాశ్చాత్య ప్రపంచం ఈ వాస్తవాన్ని దాటవేస్తోంది. ఈ ఆయుధాల్లో సోవియట్ యూనియన్‌కు అధిక్యత ఉందనే అసత్యవాదనతో అదితన సైనికతత్వ సన్నాహాలనూ ముఖ్యంగా అణ్వస్త్ర పోటీనీ సమర్థించుకొంటోంది. అయితే, సోవియట్ యూనియన్ సాంప్రదాయిక ఆయుధాల తగ్గింపునకు, కొన్ని ప్రతిపాదనలు చేసింది. రసాయనిక ఆయుధాలు, ప్రాంతీయ ఘర్షణల విషయంలోనూ యిదే జరుగుతోంది. ఈ సమస్యలపై నిర్మాణాత్మక చర్చలకు మనం సిద్ధంగా ఉన్నాము. కాని, అమెరికా కూడా దీనికి దూరంగా ఉండరాదు. మానవ హక్కులపై చర్చలు జరగవలసిన స్థాయి వేరు. ఇతర దేశాలకు వలసల విషయంలో అనుసరించ వలసిన కార్య విధానం సోవియట్ - అమెరికా సంబంధాల్లో కీలక సమస్య అయినట్లు చెప్పడం విడ్డూరంగా ఉంది. ప్రప్రథమ సమస్య అయిన నిరాయుధీ

కరణ కన్నా దానికే ప్రాధాన్యమిస్తున్నారు. అదీ కాక, ప్రాంతీయ ఘర్షణలు, జాతి వివక్షత లాంటివి ముఖ్య సమస్యలు ఉన్నాయి. సోవియట్ యూనియన్ నుంచి ప్రజల వలస సమస్యకు అంతప్రాధాన్య ముందని చాలామంది ప్రజలు నమ్మడంలేదు. మానవ హక్కులకు సంబంధించి మనమూ అడగవలసిన ప్రశ్నలు ఉన్నాయి. ఈ రంగంలో అమెరికా, ఫ్రాన్సులలో పరిస్థితి బాగుందా? దక్షిణాఫ్రికా, దక్షిణ కొరియాల మాటేమిటి? ఈ సమస్యలను రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకోవలసిన అవసరం లేదు. పైగా ఇది ఇతరదేశాల మేధావులను ఆకర్షించే పద్ధతుల్లో ఒకటి. వలస వెళ్ళడానికి అనుమతించడం మన దేశానికి బాధాకరమైనదని అనుకుంటుండడంవల్లనే అమెరికా దీన్ని ముందుకు తెస్తోంది. వలసరావడానికి మేధావులను మాత్రమే అది అనుమతిస్తోంది. ఉదాహరణకు వారు ఇథియోపియన్లను ఆహ్వానించటం లేదు. మెక్సికన్లకు తమ దేశ పౌరసత్వాన్ని ఇవ్వడం లేదు. సోవియట్ - అమెరికా దేశాల ప్రజలకు ప్రపంచవ్యవహారాల్లో గొప్ప బాధ్యత ఉంది. అందువల్ల నిరాధార ఆరోపణలకు స్వస్తిచెప్పి, నూతన సహకార రంగాలను అన్వేషించాలి. ముఖ్యంగా అంతర్జాతీయ భద్రతకు హామీ ఇవ్వడం అవసరం. ఉత్తరాది పారిశ్రామిక ప్రపంచానికి, దక్షిణాది వర్ధమాన ప్రపంచానికి మధ్య కాలగతితో పెరుగుతున్న అంతరం ఈ హామీ వల్ల తగ్గుతుంది. మనం అశ్రద్ధ చేసిన జీవ్యా  సమస్య లాంటి వాటి వట్ల తక్షణం శ్రద్ధ వహించాలి.

ఎవరి ఎజెండాను ఆమోదించడం జరుగుతుంది అనేది ముఖ్యంకాదు. ప్రాధాన్యతలను జీవితమే నిర్ణయిస్తుంది.

వాషింగ్టన్ శిఖరాగ్ర సమావేశం ప్రాముఖ్యం సోవియట్-అమెరికా సంధితో మాత్రమేకాక, మానవాళి అభివృద్ధికి గల భావి అవకాశాలతో కూడా ముడిపడి ఉంది. ఈ సమావేశం పరస్పర సంబంధాలకు నూతన పథాలను ఆవిష్కరించింది.

రెండు దేశాల్లోను మొట్టమొదటి సారిగా యీ ప్రజాభిప్రాయ సేకరణ జరిపారు. ఉభయ దేశాల మధ్య శాంతియుత సహజీవనం సాధ్యమేనా అని మొట్టమొదటి సారి అమెరికన్లను సూటిగా ప్రశ్నించడం జరిగింది. 80 శాతం మంది శాంతియుత సహజీవనం సాధ్యమేనని సమాధానం చెప్పారు.

శాంతియుత సహజీవనానికి వివేకంతో కూడిన ప్రత్యామ్నాయం ఉండ జాలదన్న స్ఫూర్తి జీర్ణించుకు పోయిన సోవియట్ ప్రజల్లో 84 శాతంమంది దీనికి సానుకూల సమాధానం చెప్పడంలో ఆశ్చర్యం లేదు. సోవియట్ దేశం పట్ల అపోహ నూరి పోయబడిన అమెరికన్లలో ఇంతమంది సోవియట్ యూనియన్‌లో లాగానే సానుకూలంగా ప్రతిస్పందించడమే విశేషం. యిది యెలాజరిగింది? ఈ అభిప్రాయ సేకరణ లోని ఇతర ప్రశ్నలకు వచ్చిన జవాబులు దీనికి వివరణ యిచ్చాయి.

ఈ రెండు దేశాల్లోను ఒక్కొక్క దేశంలో ఒక వెయ్యిమంది అభిప్రాయాన్ని సేకరించడం జరిగింది. సోవియట్ యూనియన్‌లో మాస్కో, యారోస్లావ్, మొదలైన నగరాల్లో అభిప్రాయ సేకరణ జరగ్గా, అమెరికాలో దేశవ్యాప్తంగా ఈ అభిప్రాయ సేకరణ జరిగింది. సోవియట్ ప్రతిపాదనపైననే సోవియట్ పక్షాన నొవొస్తీ వార్తా సంస్థ, అమెరికా పక్షాన న్యూస్ వీక్ పత్రిక సంయుక్తంగా యిందులో పాల్గొన్నాయి.

ఉభయ దేశాల్లోని ప్రజలు ద్వైపాక్షిక సంబంధాలను యెలా అంచనా వేస్తున్నారు?

సోవియట్ దేశంలో యిందులో పాల్గొన్న 40 శాతం మంది గత 5 ఏళ్లలో ద్వైపాక్షిక సంబంధాలు మెరుగయ్యాయనీ, 24 శాతంమంది అవి మారకుండా అలాగే ఉన్నాయనీ, 15 శాతం మంది అవి అధ్వాన్న మయ్యాయనీ నమ్ముతున్నారు. 21 శాతంమంది ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం కష్టం అంటున్నారు. అమెరికాలో 52 శాతం మంది "సంబంధాలు మెరుగు పడ్డాయి" అని, 37 శాతం మంది అవి మారకుండా అలాగే ఉన్నాయనీ, 9 శాతం మంది "అవి అధ్వాన్న

# సోవియట్ యూనియన్ అమెరికాల మధ్య
# శాంతియుత సహజీవనం

**సోవియట్ - అమెరికా సంబంధాలపై ఈ రెండు దేశాల్లోనూ సంయుక్తంగా జరిపిన ప్రజాభిప్రాయ సేకరణ**

**మయ్యా"యని, 2 శాతం మంది ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం కష్టం" అనీ అభిప్రాయ పడుతున్నారు.**

**ఈ సంబంధాల పరిస్థితి "ఎంతో సంతోషకరంగా ఉందనీ" సోవియట్ దేశంలోని 3 శాతం మంది అభిప్రాయం. "సంతృప్తి కరంగా ఉందని" 13 శాతం మంది, "సంతృప్తికరంగా లేద"ని 71 శాతం మంది, జవాబు చెప్పడం కష్టమని 13 శాతం మంది అభిప్రాయ పడుతున్నారు. అమెరికాలో 4 శాతం మంది ఈ సంబంధాల**

పరిస్థితి "చాలా సంతోషకరంగా ఉందనీ", 43 శాతం మంది "సంతృప్తికరంగా ఉందనీ", 44 శాతం మంది "సంతృప్తి కరంగా లేదనీ", 9 శాతం మంది "జవాబు చెప్పడం కష్టమనీ" అభిప్రాయ పడుతున్నారు.

మొదటి ప్రశ్నకు రెండు దేశాల్లో సమాధానాలు దాదాపు ఒకే విధంగా ఉన్నాయి. కాని రెండవ ప్రశ్నకు సమాధానాల్లో తేడా సుస్పష్టం.

ద్వైపాక్షిక సంబంధాల విషయంలో మనకన్నా అమెరికన్లు అంత ఆశావాదులుగా వుండటానికి కారణమేమిటి? మన దృష్టిలో మంచి సంబంధాలంటే నిరాయుధీకరణ సంభాషణల్లో ప్రగతి మాత్రమే కాదు. నిరాటంకమైన పూర్తి స్థాయి వ్యాపారం, నిరాటంకమైన సాంస్కృతిక, విజ్ఞాన శాస్త్రపర ఆదాన ప్రదానాలు, పరస్పర గౌరవ భావం కూడా. అమెరికన్ల దృష్టిలో మంచి సంబంధాలంటే చర్చలు జరుగుతూండటం, నాయకుల సంభాషణలు సాగుతూండటం అంతే. యింకేమి కావాలి? సంబంధాల పట్ల వారు సోవియట్ ప్రజలకన్నా యెక్కువ ఆశాభావంతో ఉండటానికి యిదే కారణం. దీన్ని బట్టి మరొక సంగతి కూడా వెల్లడి అవుతుంది. అమెరికా వారి కన్నా సోవియట్ ప్రజలకు తమ చుట్టూ ఉన్న ప్రపంచంలో యేమి జరుగుతున్నదో తెలుసుకోవాలన్న ఆసక్తి మెండు. అమెరికన్లకు ప్రపంచ వార్తలు పట్టవు. తమ దేశ, రాష్ట్ర, నగర వార్తలే వారికి ముఖ్యం.

మరో ప్రశ్నకు వారి సమాధానాలే యిందుకు సాక్ష్యం. తమ అభిప్రాయాలు చెప్పిన వారిలో 36 మం దికి మాత్రమే సోవియట్-అమెరికా సంబంధాల గురించిన సమాచారం పట్ల చాలా ఆసక్తి ఉంది. 49 శాతానికి "కాస్త" ఆసక్తి ఉంది. 14 శాతానికి ఆ సంగతి అసలే పట్టదు. (సోవియట్ యూనియన్‌లో ఈ అంకెలు వరుసగా 84 శాతం, 14 శాతం, 0 శాతం)

ఇక ఆధునిక ప్రపంచం ఎదుర్కొంటున్న ప్రమాదాల గురించిన అంచనా, 84 శాతం అమెరికన్లు

ప్రపంచ అణుయుద్ధంలో విజేతలంటూ ఉండబోరనీ, సోవియట్ యూనియన్ అమెరికాలు పూర్తిగా ధ్వంసం అవుతాయనీ అభిప్రాయ పడుతున్నారు. (మన దేశంలో 81 శాతం మంది) అణ్వాస్త్రాల సంఖ్యను యితోధికంగా పెంచడంవల్ల గానీ, ఆధునికీకరించడం వల్లగానీ యే ప్రయోజనమూ ఒనగూడ దని 65 శాతం మంది అమెరికన్లు (మన దేశంలో 79 శాతం మంది) అభిప్రాయ పడుతున్నారు. అణుయుద్ధ ప్రమాదాన్ని అమెరికన్లు గ్రహించడమే ఆశావహంగా ఉంది. శాంతియుత జీవనం, సహజీవనం తప్ప వేరే మార్గం లేదని యిది సూచిస్తూంది.

అణ్వాస్త్ర పరీక్షలపైన సంపూర్ణ నిషేధం వల్ల ఆయుధ పోటీని అంతం చేయవచ్చునని 91 శాతం సోవియట్ ప్రజలు 71 శాతం అమెరికన్లు అభిప్రాయ పడుతున్నారు. మన దేశంలో 3 శాతం మందికీ, 21 శాతం అమెరికన్లకూ దీనికి విరుద్ధమైన అభిప్రాయం ఉంది. అంతరిక్షంలో అణ్వాస్త్రాలను ప్రవేశపెట్టరాదని 95 శాతం సోవియట్ ప్రజలూ, 72 శాతం అమెరికా ప్రజలూ భావిస్తున్నారు. అయినప్పటికీ, 40 శాతం అమెరికన్లు నక్షత్ర యుద్ధాలు శాంతి స్థాపనకు దోహదకారి అని నమ్ముతున్నారు. అమెరికా ప్రభుత్వ ప్రచార ప్రభావంలో పడిన అనేక మంది అమెరికన్లు వ్యూహాత్మక దాడి చొరవ ఆత్మ రక్షణ చర్యయే అన్న అభిప్రాయంతో ఉన్నారు.

81 శాతం మంది సోవియట్ ప్రజలు అమెరికా ప్రజలపట్ల సానుకూల వైఖరిని కలిగి ఉన్నారు. 63 శాతం మంది అమెరికన్ ప్రజలు మన ప్రజలను సానుకూల దృష్టితో చూస్తున్నారు. అయితే, అమెరికా ప్రభుత్వం పట్ల సోవియట్ యూనియన్‌లో 6 శాతంమందికి సోవియట్ ప్రభుత్వం పట్ల అమెరికాలో 11 శాతం మందికి సానుకూల అభిప్రాయం ఉంది. 66 శాతం మంది అమెరికన్లు మన దేశం తానై మొట్టమొదట అణ్వస్త్రాన్ని ప్రయోగించబోదని నమ్మడం లేదు. అమెరికన్లు పైన ఇదే రకమైన అపనమ్మకం 37 శాతం సోవియట్ ప్రజల్లో ఉంది. మన దేశంలో మిహాయిల్ గోర్బచేవ్ నాయకత్వం వహిస్తున్న తీరును 82 శాతం మంది మన దేశ ప్రజలు ఆమోదిస్తున్నారు (16 శాతం మంది జవాబు చెప్పడం కష్టమన్నారు. 2 శాతం మంది ఆమోదించడం లేదు). అమెరికాపట్ల ఆయన విధానాన్ని 91 శాతం ఆమోదిస్తున్నారు. (0.3 శాతం ఆమోదించడంలేదు. మిగతావారు ఎటూ చెప్పడం లేదు). అమెరికన్లలో 51 శాతం రోనాల్డ్ రీగన్ పని విధానాన్ని ఆమోదిస్తున్నారు. 55 శాతం సోవియట్ యూనియన్ పట్ల ఆయన విధానాన్ని ఆమోదిస్తున్నారు.

ఆఖరు విషయం. యీ సర్వేలో తమ అభిప్రాయాన్ని తెలిపిన వారు తమ దేశనాయకులకు ఇస్తున్న ఒకలాంటి ఆదేశాలు. ఈ సమాధానాల్లో సోవియట్-అమెరికా సంబంధాల సమస్యలకు గల ప్రాధాన్యతా క్రమమిది: నక్షత్రయుద్ధాల సమస్యకు ప్రధమ ప్రాధాన్యతనిచ్చి పరిష్కరించాలని సమాధానాలిచ్చిన సోవియట్ పౌరులు 88 శాతం అన్నారు. వారి దృష్టిలో తర్వాత చేపట్టాల్సినవి వరుసగా యివి: వ్యూహాత్మక అణ్వాయుధాలపై పరిమితి విధింపు, సంపూర్ణంగా అణ్వాస్త్ర పరీక్షల నిలిపి వేత, మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలన, ప్రపంచంలోని ఉద్రిక్తతాలవాలాల్లో ఉద్రిక్తతల తొలగింపు, మరింత విస్తృతమైన మానవ సంబంధాలు, వర్తక, ఆర్థిక సంబంధాల విస్తరణ, అంతర్జాతీయ టెర్రరిజం, రెండు దేశాల్లో మానవ హక్కులు; సాంప్రదాయిక ఆయుధాల స్థాయి తగ్గింపు.

అమెరికన్ల దృష్టిలో సమస్యల పరిష్కార ప్రాధాన్యతా క్రమం వరుసగా యిది: అంతర్జాతీయ టెర్రరిజం, వ్యూహాత్మక అణ్వాయుధాలపై పరిమితి విధింపు, రెండు దేశాల్లో మానవహక్కులు; అణ్వాస్త్రాల పరీక్షల నిలిపివేత, మరింత విస్తృతమైన మానవ సంబంధాలు, ప్రాంతీయ ఉద్రిక్తతలనూ, ఘర్షణలనూ నడలించడం, మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలన, వర్తక ఆర్థిక సంబంధాల విస్తరణ. నక్షత్ర యుద్ధాల కార్యక్రమానికి వారు 9 వ స్థానం మాత్రమే ఇస్తున్నారు. సాంప్రదాయిక ఆయుధాల స్థాయి తగ్గింపు ఆఖరి స్థానం లోవుంది.

ఎస్.డి.ఐ. ప్రమాదాలను అమెరికన్లు తక్కువ అంచనా వేస్తున్నారనేది స్పష్టమే. అంతే కాదు. గమనార్హమైన మరో విషయమేమంటే అత్యంత

విధ్వంసకమైన వ్యూహాత్మక ఆయుధాల సమస్య చాలా ముఖ్యమ ని ఉభయదేశాల్లోని వారు భావిస్తున్నారు. మరొక వైపు, సాంప్రదాయిక ఆయుధాల సమస్య ఉభయ దేశాల్లో ఆఖరు స్థానం వహించడం ఆశ్చర్యకరం బహుశా దీనికి కారణం కేవలం మానసికమైనదేమో? అణ్వాయుధాల ప్రమాదం రెండుదేశాల్లోను ప్రజలను కలవరపెడుతున్నందువల్ల ఇతరరకాల ఆయుధాలు తెరమరుగు వెళ్ళిపోయాయా? సామాజిక శాస్త్రజ్ఞులు ఈ సమస్యను ఇంకా పరిశీలించ వలసి ఉంది.

"అంతర్జాతీయ శాంతిని కొలిచే భారమితి" పనిచేయ నారంభించింది. వాతావరణం ఎలా ఉండబోతుంది? సోవియట్ - అమెరికన్ సంబంధాలు మెరుగుపడతాయని మనమాశిస్తున్నాం. అమెరికన్లు కూడా అదే భావంతో ఉన్నారని అనుకుంటున్నాను. మనం ఇలా ఆశించడానికి ఒక సూచికను ఉదాహరణగా పేర్కొనవచ్చు రెండు పక్షాల సైనిక బలాలు సమానంగా ఉండాలని ఈ ప్రజాభిప్రాయ సేకరణలో పాల్గొన్న అత్యధికుల (మన దేశంలో 71 శాతం, అమెరికాలో 50 శాతం) నిశ్చితాభిప్రాయం. వేరు మాటల్లో చెప్పాలంటే తమదేశానికి సైనికాధిక్యత ఉండాలని వారు కోరడం లేదు. ప్రపంచంలో ఏదీ ఆయుధ శక్తితో పరిష్క రించలేమనే భావన, నూతన ఆలోచనా సరళి ప్రపంచంలో బలపడుతూంద నేందుకు సాక్ష్యం.

(ఇజ్వెస్తియా, డిసెంబరు 3, సంక్షిప్తం)

# లేఖలు

## విశాలచిత్రం

సోవియట్ రెవ్యూ ను క్రమం తప్పకుండా చదివే పాఠకునిగా నా అభిప్రాయం చెప్పడం నాకానందదాయకం. సంచిక స్వరూపంలో తెచ్చిన మార్పులతోబాటు సోవియట్ యూనియన్ లోని జీవితపు భిన్న అంశాలను గురించి బొమ్మలు, వివరాలు యిస్తున్నారు. యిప్పుడు యీ పత్రికలో ఎంతో సమాచారం వుంటున్నది. నాకు మరింత ఆసక్తికరంగా వుంది. ఇది వరకటి పత్రిక సంచికల వ్యాసాలు చూస్తే అవి ఒకే ధోరణి, ఆలోచనతో వుంటుండేవి. కాని యిప్పుడు పత్రికలోని వ్యాసాలు సోవియట్ జీవితాన్ని గురించి విశాల మయిన పరిధిలో తెలుపుతున్నాయి. ముఖ్యంగా పెరిస్త్రో యిక అమలు వల్ల సోవియట్ జీవితంలో వస్తున్న మార్పుల్ని గురించి విస్తృతంగా తెలుపుతున్నాయి.

ఎప్పటి కప్పుడు నవ్య సమాచారం ప్రచురించడం కొనసాగిస్తారని ఆశిస్తూ ధన్యవాదాలతో...

ఎ.మాల్ కోల్మ్
వెస్టర్న్ ఎక్స్‌టెన్షన్ ఏరియా
న్యూఢిల్లీ - 5

## మైత్రీ వారధి

గత 20 ఏళ్లుగానేను సోవియట్ సమీక్ష (తమిళం) పత్రిక పాఠకుణ్ణి. 1988 జనవరి నుంచి పత్రిక రూపంలోను లోపల ప్రచురించిన విషయాలలోను చాలా మార్పు వుంది. యిది ఎంతో హర్షణీయం. ఇదివరకు ఒక గెజెట్‌లాగా వుండేది. యిప్పుడలా లేదు. ఆకర్షణీయంగా వుంది. మహాత్మ గాంధిపై ప్రచురించిన వ్యాసం భారత - సోవియట్ సంబంధాల మైత్రీ వారధికి ఎంతో ఉపయుక్త మైంది.

జి. భక్తవత్సలం,
31, కె.ఎన్.అగ్రహారం స్ట్రీట్,
మద్రాసు - 600 079

## స్పష్టమయిన అవగాహన

మిహాయిల్ గొర్బచేవ్ కొత్తపుస్తకంపై వ్యాసం నాకెంతో నచ్చింది. "సో.స.ఫోరం" లో లెఫ్టినెంట్ జనరల్ డేనియల్ గ్రాహం, జనరల్ నికొలాయ్ చెర్వోవ్, మేజర్ జనరల్ హబీబుల్లాలు వ్యక్తం చేసిన అభిప్రాయాలు "నక్షత్ర యుద్ధాల" ను గురించి స్పష్టమయిన అవగాహన ఏర్పరుచుకోవ డానికి ఎంతో తోడ్పడుతాయి. నలుపు తెలుపు చిత్రాలకు బదులు రంగులలో మరిన్ని చిత్రాలు ప్రచురించాల్సిందిగా కోరుచున్నాను.

పలయాలంకున్ను సునీల్ కుమార్,
పలయంకున్ను పోస్టు

## ఆకర్షణీయమైన వ్యాసాలు

సోవియట్ సమీక్ష (తెలుగు) పత్రికను నేను అయిదేళ్లుగా చదువు తున్నాను. జనవరి సంచిక లోని వ్యాసాలన్నీ నాకు నచ్చాయి. ముఖ్యంగా మిహాయిల్ గొర్బచేవ్ పుస్తకం - పెరిస్త్రోయికా నూతన ఆలోచనా ధోరణి - పై సమీక్ష చాలా బావుంది.

డి. శ్రీనివాస రావు,
దామరపల్లి,
గుంటూరు జిల్లా. (ఆం.ప్ర)

## పెరిస్త్రోయికా, గ్లాస్‌నోస్త్

పంజాబీ భాషలో ప్రచురిత మవుతున్న సోవియట్ సమీక్షను అయిదేళ్లుగా నేను చదువు తున్నాను. పత్రికను మాసపత్రికగా మార్చడం, ముఖపత్రాన్ని రంగులలో ఆకర్షవంతంగా తీర్చి దిద్దడంవల్ల యిప్పుడు ఎంతో ఆసక్తికరంగా వున్నది. పెరిస్త్రోయికా గ్లాస్‌నోస్త్‌ల అమలు ప్రభావాలను గురించి వ్యాసాలు చదివే అవకాశం కలుగుతున్నది. సోవియట్ భారత సహకారాన్ని గురించి వ్యాసాలు ఎంతో వుపయోగకరంగా వుంటున్నాయి. నిరుప మానమయిన యీ మైత్రీ సహకారాల గురించి మీరు మరిన్ని వ్యాసాలు ప్రచురించాలి. సోవియట్ భారత సంబంధాలకు ప్రపంచ శాంతి ఆశయానికి దోహదం కూర్చే కృషిని పత్రిక యితోధికంగా కొనసాగించగలదని ఆశిస్తున్నాను.

రాకేశ్ శర్మ,
ఇం.నం.1620, సెక్టార్ - 5
రామకృష్ణాపురం,
న్యూఢిల్లీ.

పెరిస్త్రోయికా, గ్లాస్‌నోస్త్

# ధ్యేయం

# ప్రయోజనాల సమరససాధన

వి. మోత్యాషవ్

తన మానవశక్తి సామర్థ్యాలను ప్రదర్శించేందుకుగాను తనలోని ప్రతిభను నిపుణతను గరిష్టస్థాయిలో వినియోగించేందుకు ప్రతి వ్యక్తికీ ప్రేరణకల్గించే ప్రోత్సాహం నివ్వడంలో ఏ సామాజిక వ్యవస్థకు ఎంత సామర్థ్యం వుంది అన్నదానిపై ఆయా సామాజిక వ్యవస్థల్లో ఏది గొప్పది అన్నది చివరగా తేలుతుంది. వ్యక్తి ప్రయోజనాలు, సమిష్టి బృంద ప్రయోజనాలు, సమాజ ప్రయోజనాలు గరిష్టంగా సమ్మిళితమయ్యే పరిస్థితులను సకల ప్రజలకూ కల్పించడమే దీన్ని సాధించేందుకు ఏకైక మార్గం. ఏ మేరకు యిది జరిగిందీ అన్నది మానవసమాజ పరిణతిస్థాయికి సూచిక.

## వేగనిరోధక యంత్రాంగం మూలాలు

ఒక కార్మికుని ప్రయోజనాలకూ, సమిష్టి శ్రామికబృంద ప్రయోజనాలకూ మధ్య, సమిష్టి శ్రామిక బృంద ప్రయోజనాలకూ, మొత్తంగా సమాజ ప్రయోజనాలకూ మధ్య అసామరస్యత ప్రస్తుత సంస్కరణలకు ముందుకాలంలో సోవియట్ ప్రజలు ఎదుర్కొన్న సమస్యలలో ఒకటని చెప్పాల్సి వుంది. ఆ పరిస్థితి ఒక్కపూటలో రాలేదు. సోషలిస్టు సమాజం ఆవిర్భవించినప్పుడు సమాజ ప్రయోజనాల వ్యక్తి ప్రయోజనాల ఏకతకు నిజమైన పునాది ఏర్పడింది. 'వ్యక్తి యితరులకోసం పనిచేయడం. దోపిడీదారునికోసం బలవంతపు శ్రమచేయడం శతాబ్దాలతరబడి సాగేక యిప్పుడు మొదటిసారిగా వ్యక్తి తనకోసం పనిచేయడం సాధ్యమయ్యే పరిస్థితి ఏర్పడింది' 'తనకోసం పని' అంటే అర్థం యావత్ శ్రామిక ప్రజల, ప్రతి ఒక్క శ్రామికుని ప్రయోజనం కోసం అని లెనిన్ రాశారు. తనకోసం అనే అర్థం.

అయితే ఆ తరువాత ఆర్థిక, మేనేజీరియల్ ఆచరణలో యీ సామాజిక వ్యక్తి ప్రయోజనాల ఏకత భావనను అపభ్రంశం చేయడం జరిగింది. 'తనకోసం పనిచేయడం' అంటే స్వార్థపూరితమైన

# ధ్యేయం
# ప్రయోజనాల సమరససాధన

వ్యక్తిగా త్యాగాలు లేదా ఉదాత్తమైనవేవీ చేయలేని వ్యక్తిగా ప్రజలలో అభిప్రాయం కల్గించడం జరిగింది.

నికి అలవాటుపడిన పోయినవారుకూడా యితర స్వార్థపరులలాగానే పెరిస్త్రోయికాకు ముప్పుగా తయారయ్యారు.

మార్క్సిజం లెనినిజానికి చెందిన గతితార్కిక మూ అయిన యీ భావనను ఆ విధంగా విరూపం చేసారు. సమాజ ప్రయోజనాలకు వ్యక్తి ప్రయోజనాలు ఎప్పుడూ లోబడే వుండాలనీ యిది ఆర్థికంగా ఆవశ్యకమనే అభిప్రాయం కల్గించారు.

మనిషి ఉత్పాదక విధి పరమమైనదనే భావనతో అతడి సామాజిక, మేధా అవసరాలను నిర్లక్ష్యపరిచేందుకు యిది దారితీస్తుంది.

వ్యక్తి ప్రయోజనాన్ని తొలగించినట్టయితే ఉమ్మడి ప్రయోజనం అనేది కల్పనవంటి దౌతుందన్న విషయం పూర్తిగా మర్చిపోయారు. యీ లోపంవల్ల ఉమ్మడి ప్రయోజనంగా చెప్పబడుతున్న విషయంపట్ల అపనమ్మకం ఏర్పడింది. యావన్మంది నిజమైన ప్రయోజనాలకు విరుద్ధమైన వ్యక్తిగత ప్రయోజనాలకు ప్రజలు ప్రాముఖ్యమివ్వడానికి అది దారితీసి ంది. ఆ "ఫలితాలను" ఆర్థిక వ్యవస్థలో, సామాజికరంగంలో, మేధా జీవితంలో యిప్పుడు చూస్తున్నాం.

వ్యక్తిగత ప్రయోజనంపట్ల నిర్లక్ష్యం, తన పనిద్వారా వ్యక్తి తన శక్తిని చాటుకోవడానికి అవకాశాలు పరిమితం కావడం, సోషలిస్టు జీవన విధానంలో మరింత ముఖ్యమైన విలువల పాత్రను అప్రదిష్టపాలుచేసి బలహీనపర్చడం- వీటి ప్రతిస్పందనగా వినిమయమే గమ్యంగా పెట్టుకున్న జీవనసరళి పాదుకొంది. స్వలాభాలకోసం వెంపర్లాడే వారి బృందం ఏర్పడింది. ఈ జాడ్యం ముదిరింది.

ఇతరులకు నష్టం కలిగిస్తూ లాభాలు పొందడం లక్ష్యంగా పెట్టుకొన్న స్వార్థపర బృందాలు కొన్నికాగా మరొక రకంవారు పెద్దసంఖ్యలో ఏర్పడ్డారు. వారు కొద్దిపాటి శ్రమతో ఏమాత్రం జీవితం దొరికినా అదే చాలనుకునేవారు.

ఎలాటి చొరవాలేకుండా నిర్వచిత పరిమితుల లోనే పనిచేస్తు, ఎలాటి పరిస్థితులలోనూ తమకెలాటి యిబ్బంధులూ వుండని ఒకరకం ధర్మసంస్థ లాగా సోషలిస్టు సమాజాన్నిపరిగణిస్తూ సోషలిజంలో జీవితాన్ని అలా నిరాసక్తంగా గడిపెయ్యడా

## బ్యూరాక్రాట్ మనస్తత్వం

సకాలంలో పరిస్థితిని సరిచేయకుండా నిరోధించి సమాజ వ్యతిరేక ప్రయోజనాలు ఆవిర్భవించడానికి, బలవడటానికి గతంలో దోహదపడిన శక్తులు, యీనాడు సమాజ ప్రయోజనాల సమరసతను అడ్డంగొడ్తున్న శక్తులు ఏవి? అని అడగడం సబబే. జవాబులు భిన్నంగా వుండవచ్చు. అయితే

**ఎలాటి చొరవాలేకుండా నిర్వచిత పరిమితుల లోనే పనిచేస్తూ, ఎలాటి పరిస్థితులలోనూ తమకెలాటి యిబ్బందులూ వుండని ఒకరకం ధర్మసంస్థ లాగా సోషలిస్టు సమాజాన్ని పరిగణిస్తూ సోషలిజంలో జీవితాన్ని అలా నిరాసక్తంగా గడిపెయ్యడానికి అలవాటుపడి పోయినవారుకూడా యితర స్వార్థపరుల లాగానే పెరిస్త్రోయికాకు ముప్పుగా తయారయ్యారు.**

అధికార పదవిని అధిష్ఠించిన వ్యక్తి మనస్తత్వంవంటి ముఖ్య అంశాన్ని ఎవరూ విస్మరించలేరు. అది ఒక బ్యూరాక్రాట్ ప్రవర్తనలో అతిబలంగా వ్యక్తమౌతుంది. రాజ్యంలోపల ఒక రహస్య సంఘంగా నిపుణమైన ఒక కార్పొరేషన్‌గా బ్యూరాక్రసీని మార్క్స్ నిర్వచించారు. ఏ సమాజమైనా వివిధ తరగతుల సామాజిక బృందాల పరస్పర కార్యాచరణలముడి అని చెప్పవచ్చు. ఈ బృందాలన్నిటికీ ప్రత్యేక ప్రయోజనాలుండటంలో తప్పేమీ లేదు. అయితే వాటిని సోషలిస్టు సమాజంలోని యావన్మంది ప్రజల ప్రయోజనానికి పోటీగా పెట్టకూడదు.

అయితే కార్పొరేట్ ప్రయోజనాలు అనేవి వేరు. అవి శాఖాపరతత్వం, సంకుచిత తత్వం, తెగతత్వం, బంధుప్రియత్వం, ముఠాతత్వం రూపాన్ని

తీసుకుంటాయి. అది దురహంకార పూరితం, ఏ యితర ప్రయోజనాలైనా తనకు లోబడి వుండేటట్లు చేసుకోదలుస్తుంది. సమాజ ప్రయోజనాలకు ఎప్పుడూ వ్యతిరేకంగా వుంటుంది. అపరిపక్వ మేధస్సుల ప్రయోజనంగా యిది సర్వసాధారణంగా వుంటుంది.

అణిగివుండటాన్ని పెత్తనాన్నీముందే నిర్ణయమై పోయిన లాంఛనప్రాయ చర్యలు, వుద్దేశాలు మూస పోతలుగల యంత్రాంగాన్ని బ్యూరాక్రాట్ గుడ్డిగా నమ్ముతాడు, వాస్తవాన్ని గురించి జ్ఞానం వుండదు. అందువల్ల బ్యూరాక్రాట్ స్వభావరీత్యానే పిడివాదిగా వుంటాడు. అందువల్లే అసలు సమస్యను పక్కకు తోసివేస్తాడు లేదా అరకొర చర్యలు తీసుకుంటాడు. అవి ఖాయంగా విఫలమవుతాయి.

బ్యూరాక్రాట్ అన్నిటికన్నా అతి తీవ్రంగా అసహ్యించుకునే విషయం గ్లాస్‌నోస్త్. తాను రాజ్య అత్యున్నత ప్రయోజనాలను పరిరక్షించే వాడుగా, తిరుగులేని షాడుగా, తప్పులు ఎన్నటికీచేయని అప్రమత్త సంరక్షకునిగా, ప్రజల సంక్షేమానికి నిస్వార్థంగా పాటుపడే వాడుగా తనను గురించి అభిప్రాయాన్ని కల్గించడానికి వీలుండాలంటే యీ గ్లాస్‌నోస్త్ వుండకూడదు.

బ్యూరాక్రట్ అధికారానికి నిజమైన ప్రాతిపదిక అంటూ ఏదైనా వుందీ అంటే అది ప్రజలకు నిజపరిస్థితి తెలియకపోవడమే. గ్లాస్‌నోస్త్ వుంటే, సమస్యలపై బహిరంగంగా ప్రజాతంత్రయుతంగా చర్చ జరిగితే గోప్య, తేజోమండలం వంటివి బ్యూరాక్రసీకి లేకుండా పోతాయి.

తనకు పరాయమైన ప్రయోజనం తమ ప్రయోజనాల పరిధిలోకి ఎలాగో ప్రవేశించి అదే కీలకమైనదిగా తోచినప్పుడు వ్యక్తులేకాదు, సామాజిక బృందాలు సైతం తమ సొంత ప్రయోజనాలకే హానికరంగా ప్రవర్తించే ప్రమాదముంటుంది. 'పైనుంచి' మంజూరుకాని ఏ చొరవనైనా బ్యూరాక్రటిక్‌గా అణచివేయడం, అన్ని రకాలనిషేధాలు, రాజ్యవ్యవహారాలను ఆలోచించేందుకు శ్రామిక ప్రజలకు గల సామర్థ్యంమీద అపనమ్మకం—యినవ్నీ గణనీయ సంఖ్యాకులపై దుష్ప్రభ ఎం కల్గిస్తాయి. బాధ్యతారాహిత్యానికి అలవాటుపడేలా చేస్తాయి. 'నచల్‌స్తవోకు (ఎస్టాబ్లిష్‌మెంట్ అని అర్థం చెప్పవచ్చు) మరింత బాగా తెలుసు' అన్నది బాగా విస్తరించిన జీవనతత్వమైంది. కొందరికిది చాలా సౌకర్యంగా వుంది.

బ్యూరాక్రట్ అధికారానికి నిజమైన ప్రాతిపదిక అంటూ ఏదైనా వుందీ అంటే అది ప్రజలకు నిజపరిస్థితి తెలియకపోవడమే. గ్లాస్‌నోస్త్ వుంటే, సమస్యలపై బహిరంగంగా ప్రజాతంత్ర యుతంగా చర జరిగితే గోప్యత, తేజోమండలం వంటివి బ్యూరాక్రసీకి లేకుండాపోతాయి.

అయితే అలాటి తత్వాన్ని పట్టుకువేళ్లాడే వారికి యిప్పుడు జీవితం క్లిష్టతరమౌతోంది. స్తబ్దతను బద్దలుకొట్టి పెరిస్త్రోయికా ఆశయాన్ని ముందుకు తీసుకుపోవాలన్న ఉత్సాహం, చొరవగలవారిని యీ కాలం ముందుకు తెస్తున్నది.

## నిరాసక్తతను అధిగమించే కృషి

మొత్తం సార్వత్రిక ప్రయోజనం నిర్దిష్ట ప్రయోజనంగా మారినప్పుడే బ్యూరోక్రసీని రద్దు చేయడం సాధ్యం. అయితే నిర్దిష్ట ప్రయోజనం నిజంగా మొత్తం సార్వత్రిక ప్రయోజనంగా మారినప్పుడే పైనపేర్కొన్న పరివర్తన సాధ్యం అని మార్క్స్ రాశారు. 'నాది' 'మనది' మధ్య దృఢమైన అంతస్సంబంధం ఏర్పడినప్పుడే అది బ్యూరాక్రాట్ ఉనికికి పునాదిని తొలగిస్తుంది. బ్యూరోక్రాట్ కార్యాచరణ రంగాన్ని తొలగిస్తుంది.

రాజ్యానికి లాభదాయకమైన దానినుంచి ప్రతి సమిష్టి శ్రామిక బృందం, ప్రతివ్యక్తీ లాభంపొందేలా చేసే ఒక యంత్రాంగం యిప్పటికే రూపుదిద్దుకుంటోంది. అది సమీప భవిష్యత్తులోనే ఆవిర్భవిస్తుందని ఎవరైనా ఆశించడం సహజం.

# ధ్యేయం

# ప్రయోజనాల సమరసాధన

రాజ్యానికి లాభదాయకమైన దానినుంచి ప్రతి సమిష్టి శ్రామిక బృందం, ప్రతివ్యక్తీ లాభంపొందేలా చేసే ఒక యంత్రాంగం యిప్పటికే రూపుదిద్దుకుంటోంది. అది సమీప భవిష్యత్తులోనే ఆవిర్భవిస్తుందని ఆశించడం సహజం.

ఉత్పత్తి ఖర్చు మదింపు పద్ధతికి పూర్తిగా మారిన కర్మాగారాది సంస్థలలో యీ యంత్రాంగం బీజాలు యిప్పటికే పడ్డాయి.

వ్యక్తి, సమిష్టిసంస్థ, యావత్ సమాజ ప్రయోజనాలు అఖండమైన ఏకమొత్తంగా రూపుదిద్దుకుంటూండటం వల్ల మానవ ప్రతిభా వ్యుత్పన్నత వెలికివచ్చేందుకు మరిన్ని అవకాశాలు ఏర్పడుతాయి. వనరుల ఆదాకు వీలుగా నూతన పద్ధతులు కనుగొంటారు. సమిష్టి సంస్థలకు లాభాలు చేకూరు తాయి.

'పై' స్థాయి మేనేజిమెంటు అనేది 'పునాది' స్థాయి వారిపై ఆధారపడి, వారికి జవాబుదారీగా, వారి అజమాయిషీకి అవసరమైతే వారు దానిని మార్చడానికి వీలుగా ఉండాలి అంతేకాదు ప్రజలకు అవసరమైన నిజమైన సరకుల ఉత్పత్తి, తుది ఫలితాలద్వారా సంస్థ సంపాదించిన దానిపై మేనేజర్ వేతనం ఆధారపడి వుండాలి.

---

**వ్యక్తి పనినిబట్టి వేతనం సూత్రాన్ని యెకరీతిగా అమలుపర్చడం అనేది ప్రయోజనాలను సమరస పర్చే యంత్రాంగంలో ఒక విడదీయరాని అంశం.**

---

వ్యక్తి పనినిబట్టి వేతనం యేకరీతిగా అమలు పర్చడం అనేది సమాజ ప్రయోజనాలను సమరసపర్చే యంత్రాంగంలో ఒక విడదీయరాని అంశం. ఇది ఒకపక్క శ్రామికప్రజల ప్రయోజనాలకు రక్షణ కల్పిస్తుంది మరోప్రక్క అనార్జిత అదాయాలకు మోసగాళ్లకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టిన చర్య అవుతుంది.

నిపుణ కార్మికులు, ఇంజనీర్లు, శాస్త్రరంగ సిబ్బందివంటి సృజనాత్మక కృషి చేసేవారికి నష్ట కరంగా వేతననిధులలో "పొదుపు చేయడం" అనే పొరపాటు ఆచరణను తిరస్కరించినచోట జాతీయ ప్రయోజనాలు వ్యక్తి ప్రయోజనాలతో మిళితం కావడం మరింత వేగంగా జరుగుతున్నది. దానివల్ల 'ఆర్థిక వ్యత్యాసం' మరింత పెరుగుతుందనే భయాలు అర్థరహితమని జీవితమే రుజువుచేస్తుంది. ఉత్పత్తిఖర్చు మదింపు పద్ధతిలో పనిచేసే శ్రామిక బృందాల అనుభవం దీన్ని రుజువుచేస్తున్న అంశాలలో ఒకటి. సమిష్టి అజమాయిషీ, సంయుక్త ప్రయోజనంవల్ల ప్రతి కార్మికుని శ్రమ ఉత్పాదకత పెరుగుతుంది. దాని ఆధారంగా బృందం ఆదాయాలు పెరుగుతాయి.

పలువిధ సహకార, వ్యష్టి శ్రమ కార్యకలాపాల వల్ల వ్యక్తిగత పాదార్థిక ప్రయోజనాలను సమాజ ప్రయోజనంతో మిళితపర్చేందుకు అపార అవకాశాలు ఆవిష్కృతమౌతాయి.

అయితే నూతన ఆర్థిక యంత్రాంగం దానంతటదే పనిచేస్తుందని అనుకుని కూచోడం విజ్ఞతకాదు. దానికి ముప్పుతెచ్చే కార్పొరేటివ్ బృందాలున్నాయి. అంతేకాదు భవిష్యత్తులోకి చూడాలి - ఇప్పటికే సుఖతర జీవితానికి సరిపోయే ఆదాయం పొందుతున్న వ్యక్తికి మరో రూబుల్ అదనంగా యివ్వడం ఒక్కటే ప్రోత్సాహం కల్గించబోదు.

ఉదాత్తమైన సామాజిక లక్ష్యానికి అంకితభావం, కర్తవ్య నిర్వహణాభావనవంటి అభివర్గాలు లేకుండా వ్యక్తికి సమాజానికి మధ్య అవిభాజ్య బాంధవ్యం' నెలకొనడం అసాధ్యం.

పనిపట్ల అత్యున్నత సూత్రబద్ధ ప్రేరణలే తన దేశానికి తాను నిజమైన యజమానిని అన్న భావనను కల్గిస్తాయి. వ్యక్తికి ఆత్మవిశ్వాసం తన సృజనాత్మక సామర్థ్యాలను యితరుల ప్రయోజనానికి వినియోగించాలన్న సంసిద్ధత ఆ ఉదాత్త ప్రేరణల వల్లే కలుగుతాయి.

(ప్రావ్దానుంచి సంక్షిప్తం)

# వేగనిరోధక యంత్రాంగాన్ని త్రిప్పికొట్టడం ఎలా?

ప్రొఫెసర్ అనతొలి బ్యూతెంకో
డి.ఎస్.సి.(తత్వశాస్త్రం)

ఇవి భారతీయ పాఠకులకు ప్రధానమైన ప్రశ్నలను కుంటున్నాను. "వేగ నిరోధక యంత్రాంగం" అన్న పదం, యిటీవలే వాడుకలోకి వచ్చింది. కాని, . బాధాకరమైన విషయమేమిటంటే యీ క్రమంమాత్రం అంతకన్నా పూర్వమే ఆరంభమైంది. సోషలిజంలో అలాంటి పదానికి ఆస్కారం ఉండ కూడదు. కాని అలాటి యంత్రాంగం ఏర్పడటానికి ప్రాతిపదిక లేక పోలేదు.

సామాజిక పరిపాలనకు చెందిన రాజ్యవిధాన రూపాల కింద,"...వర్గపాలన స్థానాన్ని ప్రభుత్వం ఆక్రమించుకునే నిరంతర ప్రమాదముంద"ని గుర్తుంచు కోవడం అవసరమని కారల్ మార్క్స్ ఒక సందర్భంలో రాశారు. అంటే అధికారానికి వచ్చిన వర్గానికి బదులు పాలక స్థానంలో ఉండే దాని ప్రతి నిధులే వర్గపాలన విధులను స్వాయత్తం చేసుకొని, అమలు జరిపే పరిస్థితి యేర్పడే ప్రమాదం ఉందన్న మాట. ఇలా వర్గపాలన విధులను స్వాయత్తం చేసుకునే ప్రమాదం కార్మికవర్గం అధికారానికి వచ్చిన సమయంలో కూడా ఉంటుందని ఎంగెల్స్ రాశారు. ఏ సమాజంలో నైనా సరే దాని జీవశక్తికి అవసరమైన "సాధారణ విధులను" నిర్వర్తించాల్సిన అవసరం ఉంటుందని ఆయన పేర్కొన్నారు. ఈ విధులను నిర్వర్తించే వారు సమాజ శ్రమవిభజనలో ఒక కొత్త శాఖగా ఏర్పడుతారని ఎఫ్. ఎంగెల్స్ రాశారు. వారు ఆ విధంగా, తమకు అధికారమిచ్చిన వారి విషయంలో కూడా ప్రత్యేక ప్రయోజనాలను ఒనగూర్చుకొని తమ కధికారం యిచ్చిన వారికి అతీతులై పోతారు.

అందువల్ల, సోవియట్ రాజ్యాభివృద్ధిలో బ్యూరాక్రసీ జాడ్యం కనిపించడం ప్రారంభం కాగానే లెనిన్ ఇలా పేర్కొన్నారు. సోషలిస్టు రాజ్యంలో బ్యూరాక్రటిక్ వక్రీకరణలనుంచి కార్మిక వర్గం తన

రాజ్యాన్ని కాపాడు కోవడం, తన రాజ్యం నుంచీ తనను తాను కాపాడు కోవడం దీని వల్ల అవసర మవుతున్నది.

అయితే, లెనిన్ మరణానంతరం, ఈ రాజ్యాధి కార వ్యవస్థ తన పాలనలో నిరంతరాయంగా బ్యూరాక్రటిక్ లక్షణాలను పెంపొందించుకొంటూ వచ్చింది. అంతకంతకూ యెక్కువగా తన్ను తాను కార్మిక వర్గం కన్నా ఉన్నత స్థానంలో పెట్టుకొంటూ వచ్చింది. అయితే, కార్మిక వర్గం, శ్రామిక ప్రజలు యిట్టి రాజ్యాధికార వ్యవస్థనుంచీ తమ ప్రయోజ నాల రక్షణకు హామీ కల్పించే సాధనాలను కను గొనడంలో కృతకృత్యులు కాలేక పోయారు.

సామూహిక ప్రతీకార దమనకాండ, మానవతా వ్యతిరేకత, జీవితంపట్ల టెక్నోక్రాట్ వైఖరి గల వ్యక్తి పూజనాటి రాజకీయ వ్యవస్థే కార్మిక వర్గపు, దాని మిత్రుల రాజకీయ పాలనకు ప్రతినిధి అని చెప్పడం సరికాదు. కార్మిక వర్గపాలన వీటికి ఒడి గట్టి గలదని చెప్పడం అసలు కార్మికవర్గ సిద్ధాంతా న్ని దూషించడమే. నాడు జరిగింది ఏమిటంటే, జె.స్టాలిన్ వర్గపాలన స్థానాన్ని స్వాయత్తం చేసుకొ న్నారని చెప్పడం సరిగా ఉంటుంది. వక్రీకరణలు, వైకల్యాలు, కార్మికుల, రైతుల, ఉద్యోగుల ప్రయో జనాల మధ్యగల తేడాలను బోనాపార్టిస్ట్ తీరులో ఉపయోగించుకోవడమూ దాని లక్షణాలే.

ఇలాంటి వ్యవస్థ ప్రజల్లోని సామూహిక చొరవ ను, రాజకీయ క్రియా శీలతను చంపేసింది. అత్యంత తీవ్రమైన విప్లవకర మార్పును తేగలిగిన వారిలో నిర్లిప్తత పెరగడానికి యిది మూలకారణం కాదా?

కాబట్టి, వేగనిరోధక యంత్రాంగాన్ని ఒక చారిత్రక స్థితి గతిగా పరిగణిస్తూ, మనమిలా చెప్పవచ్చు: వేగ నిరోధక యంత్రాంగం అనేది వర్గపాలన స్థానాన్ని అక్రమంగా స్వాయత్తం చేసు కొన్న పాలక-బ్యూరాక్రాటిక్ యంత్రాంగం నుంచి ఉత్పన్న మైనది. ఆర్థిక, రాజకీయ వ్యవస్థ వికృత రూపాలు దానికి విలక్షణమైన భావజాలం, మనస్త త్వంతో సహా సమాజంలో చారిత్రకంగా స్థాపిత మైంది.

సోవియట్ సమాజాభివృద్ధిని అరికట్టడానికి ఎవరూ ఉద్దేశ పూర్వకంగా ప్రయత్నించలేదనీ, నిరోధక యంత్రాంగాన్ని ఎవరూ పనిగట్టుకొని రూపొందించలేదని ఈ అవగాహనను బట్టి తేలు తుంది. అయితే, స్టాలిన్ కీ, ఆయన బృందానికీ నిరంకుశాధికారం కట్ట బెట్టే రాజకీయ వ్యవస్థను మాత్రం పూర్తి ఉద్దేశ పూర్వకం గానే పెంపొందించడం జరిగింది. సామాజిక వ్యవహారాలను రాజకీయ ఆర్థిక వరంగానిర్వహించేందుకు ఒక యంత్రాంగాన్ని యీరాజకీయవ్యవస్థ రూపొందించి అభివృద్ధి పర్చింది. అది వేగానిరోధక యంత్రాంగానికి ప్రతినిధి అయింది. వర్గపాలనను స్వాయత్తం చేసుకున్న పరిపాలక బ్యూరోక్రాటిక్ పాలనను దృఢపర్చుకునేందుకు తగిన విధంగా యిది రూపొందింది.

అధికార వ్యవస్థలో ఉన్నత పదవులను అధిష్టించిన వారికీ పార్టీ 20 వ మహాసభ సింహ స్వప్నమైన మాట వాస్తవమే. అయినప్పటికీ మరి కొన్ని దశాబ్దాల పాటు ఈ బృందాలు యధేచ్ఛగా సాగాయి. యీ మహాసభ 10 వ వార్షికోత్సవం సైతం జరగనివ్వకుండా చేసి ప్రతీకారం తీర్చు కున్నాయి. 1960,1970 లలో స్టాలిన్ హయాంనాటి ప్రతీకార దమన కాండ లేకున్నప్పటికీ ఆ పాలక అధికార వర్గ స్థాయిలోని మేనేజర్ల స్వచ్ఛంద వాదరాజ్య వ్యవస్థ మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లింది.

ఈ వేగ నిరోధక యంత్రాంగం సామాజిక రాజకీయ ఆర్థిక, భావజాల పునాదులేమిటి?

రాజ్య విధానంలో, ఈ అధికార వ్యవస్థ బాగా ఆలోచించి ఏర్పరచిన పదవుల దొంతరే. సామాజిక జీవితంలోని అన్ని రంగాలపైన, మొత్తం ఆర్థిక కార్యకలాపాల పైన ప్రభుత్వం తన ప్రత్యక్ష కేంద్రీకృత సారధ్యాన్ని అమలు జరిపే వ్యవస్థ యిది. పార్టీ విధులను, రాజ్యాంగ యంత్ర విధులను ఆచరణలో యిది విలీనం చేసింది. పైనుంచి నియమితులైన నాయకుల, పరిపాలకుల చేతుల్లో యావత్తు అధికారాన్ని కేంద్రీక రించింది. అది ప్రజలకు ఉండవలసిన అవసరం లేకుండా చేసింది. శ్రామిక వర్గం, ప్రజలు దేశయ జమానులుగా ఉండే అవకాశాలు లేకుండా పోయా యి.

ప్రభుత్వ యాజమాన్య రూపాన్ని యావన్మంది ప్రజల ఆస్తిగా ప్రకటించడంమైతే జరిగింది గాని, ఆఆస్తితో వారికి గల అనుబంధం శ్రమసాధనాలు గానే తప్ప, మేనేజరుగా కాదు. కార్మికులకు, ఇతర ప్రజానీకానికి ఉండిన స్థానం పాలక అధికార బృందం యంత్రాంగానికి పూర్తిగా లొంగి, వుండే స్థానమే అయింది.

ఇటువంటి యాజమాన్యరూపం ఈ రాజకీయ స్వరూపానికి ప్రాతిపదిక అయింది. ఈ ఆస్తి వినియోగంలో, దాన్ని పెంపొందించడంలో మనిషి ప్రయోజనాలకు తావులేకుండా పోయింది.

సామాజిక విషయాలలో ఈ ఆర్థిక-రాజకీయవ్యవస్థ సమాజంలోని అన్ని వర్గాల ముఖ్య ప్రయోజనాలు ఒకటేనన్న భావం గురించిన మొరటు భాష్యంపై ఆధారపడింది. వివిధ సామాజిక బృందాలు, తరగతుల ప్రయోజనాల మధ్యగల తేడాలను కప్పిపెట్టారు.

వేగనిరోధక యంత్రాంగ స్వరూపంగురించిన ఈ పరిశీలన ముగిస్తూ ఈ యంత్రాంగాన్ని యిలా నిర్వచించవచ్చు: బిర్రబిగిసిన ఆర్థిక రూపాలు, కాలం చెల్లిన రాజకీయ, వ్యవస్థాత్మక రూపాలు, తగిన ఫలితమివ్వని మార్గదర్శక పద్ధతు లూ, పరిపాలనా సాధనాలు — వీటన్నిటి సమాహారమే ఈ యంత్రాంగం. తదనుగుణమైన భావజాలంతో, మనస్తత్వంతో యివి పవిత్రతను సంతరించుకు న్నాయి. అందువల్ల, సోషలిజం ఆధిక్యతను వినియోగించు కోవడం అసాధ్యమైంది. సోషలిజం ఫలప్రద అభివృద్ధి దీని వల్ల కుంటుబడింది. దీని పురోగతి మందగించింది.

ఈ అవరోధాన్ని అధిగమించే మార్గాలేమిటి? పెరిస్త్రోయికా కీలక కర్తవ్యాలను గురించి ఆలోచించేటప్పుడు మనం జడత్వానికి సంబంధించిన భావజాలాన్ని మనస్తత్వాన్ని విమర్శించడం, సోషలిజాన్ని గురించినటువంటి కరడు గట్టిన భావాలను ఖండించడం, ఉత్పత్తి సంబంధాలకు చెంది నట్టి పాతకొలుకులను యెత్తి చూపడం, ఉపయోగపడని ప్రోత్సాహకాలను విమర్శించడం, కాలంచెల్లిన మేనేజిమెంటు రూపాలను పరిహసించడం వంటి వాటికి మాత్రమే మనం పరిమితం అయితే సరిపోతుందను కోవడం పొరపాటు.

ఇవన్నీ అవసరమే. కాని, ఈ కర్తవ్యం లోని సృజ నాత్మక భాగం ప్రత్యేకించి ముఖ్యమైనది. అదేమి టంటే, పాత యంత్రాంగాన్ని యెలా తొలగించి వేయాలో, వేగ నిరోధక యంత్రాంగం తొలగి పోయి సత్వరాభివృద్ధికర యంత్రాంగం సుస్థాపిత మయ్యేందుకు పాత యంత్రాంగం స్థానంలొ దేనిని తీసుకు రావాలో స్పష్టంగా అవగాహన చేసుకొని, వెల్లడించడం. ఇది ఒక్క ఊపుతో జరిగే పని కాదు. తొందరపాటు తగదు. మునుపు నాయకత్వంలో ఉన్న సిబ్బంది స్థానంలో కొత్త సిబ్బందిని నియమిస్తే చాలుననుకోవడం పొరపాటు. మునుపటి వ్యవస్థే చూపిన పాతదారిలోనే వారూ నడుస్తారు. కాబట్టి, సామాజిక జీవితంలోని అన్ని రంగాల పునర్ వ్యవస్థీకరణను గురించిన ఒక సమగ్ర భావంవుండటం అవసరం.

సి.పి.ఎస్.యు. కేంద్రకమిటీ 1985 ఏప్రిల్ ప్లీనరీ సమావేశం జరిగి దాదాపు మూడేళ్లు గడి చింది కాబట్టి పెరిస్త్రోయికా భావనను ఇది వరకే రూపొందిచారని గట్టిగా చెప్పవచ్చు. కేంద్రకమిటీ 1987 జూన్ ప్లీనరీ సమావేశం దీనికి రూపు దిద్దటం పూర్తి చేసింది. దీన్ని తరువాత అమలు జరుపటం వల్ల వేగనిరోధక యంత్రాంగ స్థానంలో దేశ సామాజిక - ఆర్థికాభివృద్ధిని త్వరితంచేసే యంత్రాంగం తప్పకుండా నెలకొంటుందని భావించవచ్చు.

మొత్తంపై చెప్పాలంటే పెరిస్త్రోయికా సారాంశ మల్లా సోషలిజం సూత్రాలు అమలు జరిగినట్లు ప్రకటించడం కాక, వాటిని నిజంగా అమలు జరపడం. ముఖ్యంగా ఆర్థిక, రాజకీయ రంగాల్లో యిది అమలు జరగాలి. ఆర్థిక రంగంలో దీని అర్థమిది: ఉత్పత్తి సాధనాల లాంచన ప్రాయ సామాజికీకరణ కాక వాటివాస్తవ సామాజికీకరణ జరగాలి; సమస్త కార్మికులు వాటి ఉమ్మడి యజమానులుగా, దేశ అధినేతలుగా మారాలి. పార్టీరూపొందించిన పునర్నిర్మాణ వల్ల యిది అమలుఅవుతుంది.

రాజకీయాల్లో పెరిస్త్రోయికా అర్థం, ఆచరణా

త్మక ప్రజాస్వామ్యానికి నిర్ణయాత్మకంగా మలుపు తీసుకరావడం.

అసలు సమస్య పౌరుల హక్కులనూ, స్వేచ్ఛలను మునుపెన్నడూ లేనంతగా విస్తరించడం, ఆయా సమస్యల పైనా, విమర్శా, ఆత్మ విమర్శ పైనా తమ అభిప్రాయాలను వెల్లడించేందుకు శ్రామిక ప్రజలకు అవకాశమిచ్చే బాహాటతను పెంపొందించడం, ప్రభుత్వ కార్యకలాపాలపై ప్రజానీక నియంత్రణ — వీటిలో బాటు రాజకీయ వ్యవస్థను మొత్తంగా పునర్ వ్యవస్థీకరించడం. ఈ రోజు వరకు కొందరు తాము న్న పదవి కారణంగా ఇతరుల భవిష్యత్తులకు నిర్ణేతలుగా ఉంటున్నారు. కానీ, ఆ ప్రజలకు జవాబు దారీగా లేరు. తమ చర్యల విషయంలో పై అధికారులకు మాత్రమే వీరు జవాబుదారీ వహిస్తున్నారు. యిది ఎంతో ప్రతికూలమైన చెడు పర్యవసానాలకు దారితీసింది.

ఈ పరిస్థితి సమూలంగా మారాలి ప్రతి అధికారినీ ప్రజల నియంత్రణ కింద ఉంచాలి. తత్ఫలితంగా మొత్తం రాజకీయాధికార వ్యవస్థను ప్రజల అధికార వ్యవస్థగా స్వయంగా ప్రజలే మార్చాలి, (మార్క్స్) అంటే అది సోషలిస్టు స్వయం పరిపాలనా వ్యవస్థగా మారాలి. ఈ కర్తవ్యాలనూ, పెరిస్త్రోయికాకు సంబంధించిన యితర కర్తవ్యాలనూ నిర్వర్తించి నప్పుడే వేగ నిరోధక యంత్రాంగం బద్దలైందనీ, దాని స్థానంలో త్వరీకరణ యంత్రాంగం స్థాపితమైందనీ, సోవియట్ సమాజం ఒక కొత్త చారిత్రక దిశలోకి అంటే సత్వర సామాజిక ఆర్థిక అభివృద్ధి దశలోకి కమ్యూనిజం దిశగా ప్రణాళికా బద్ధమైన ముందడుగు వేసే పథంలో సోషలిజాన్ని మరింత మెరుగుపర్చే ధశలోకి ప్రవేశించిందని చెప్పగలం.

ఒగోన్యోక్
వారపత్రికకు
పాఠకుల లేఖలు

# మానవ ప్రాణం పవిత్రమైంది

ఉరిశిక్షను కొనసాగించాలా రద్దు చేయాలా అని సోవియట్ పత్రికలలో చర్చ సాగుతూంది. భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి.

న్యాయ శాస్త్ర పండితుడు, సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడెమిలోని రాజ్యం-న్యాయం ఇన్స్టిట్యూట్ లో నేరచట్టం సిద్ధాంతం సమాజ శాస్త్ర విభాగాధిపతి అయిన ప్రొ అలెగ్జాండర్ యాకోవ్లెవ్ అభిప్రాయం యిక్కడ పొందుపరుస్తున్నాం:

## చట్టాలు కఠినంగా వుండాలా?

శిక్ష ఎంత కఠినంగా వుంటే నేరాలు అంతగా తగ్గుతాయని చాలా మంది మనస్ఫూర్తిగానే భావిస్తుంటారు.

రాజ్య ఆస్తి లేదా పౌర ఆస్తి విషయంలో దారుణమైన దుర్వినియోగానికి పాల్పడిన వారిని కాల్చివేసే మరణ శిక్షను 1962 లో సోవియట్ యూనియన్‌లో ప్రవేశపెట్టారు అయితే అలాటి నేరాలు తగ్గలేదు సరిగదా పెరిగాయి.

మరీ కఠినమైన శిక్షల వల్లమరింత తీవ్రమైన నేరాలు పెరుగుతాయి. మానభంగ నేరానికి మరణ శిక్షను ప్రజల వత్తిడిపై 1960 లలో ప్రవేశపెట్టాం. మానభంగానికి గురయ్యే వారిని గురించే ఆలోచించాం తప్ప నేరస్తుల గురించి ఆలోచించలేదు. నిజానికి యిది రెండో నేరానికి హత్యకు - దారితీసింది.

సోవియట్ యూనియన్‌లో చాలా కఠినమైన శిక్షాస్మృతి వుంది. శిక్షలు మరింత కఠినంగా వుండాలన్న డిమాండ్ రావడానికి దీన్ని గురించి తెలియక పోవడం గూడా కారణని నా భావన.

మరణ శిక్ష అంటే ఒక విధంగా హత్యను చట్టబద్ధం చేయడమే అవుతుంది దాన్ని నిర్ణయించే అధికారం ఒక వ్యక్తి తీసుకుంటాడు.

మానవ ప్రాణం పవిత్రం. దాన్ని తీయడానికి ఎవరికీ చివరికి ప్రభుత్వానికి కూడా హక్కు వుండరాదు.

దర్యాప్తు విచారణ సమయంలో దారుణమైన పొరపాట్లు జరిగే అవకాశం వుండవచ్చు. ఒక నేరస్తుడు, మనుషుల్ని చంపడమే పనిగా పెట్టుకున్న దుష్టత్వానికి మూర్తీభావం అని నూటికి నూరుపాళ్లు నిశ్చయంగా ఎవరూ చెప్పలేరు.

దీర్ఘకాల జైలు నిర్బంధ శిక్షలు కూడా వున్నాయి. ఇవి ఉపయుక్తమా? శిక్షల ద్వారా మనం సాధించాలనుకున్న లక్ష్యాలకు యివి తోడ్పడుతాయా?

కనీసం 30 శాతం కేసులలో దీర్ఘకాలం జైలు శిక్షలు నిష్ప్రయోజనమే. **మొదటిసారి** నేరాలు చేసిన వారిలో మూడవ **వంతు** మంది మళ్ళీ కొత్త నేరాలు చేస్తున్నారు "జైలు నిర్బంధం అసాధారణమైన వాతావరణం" కావడం ఒక కారణం. మొదటి అయిదు, ఆరేళ్ళ పాటు, ఒక్కొక్కపుడు ఏడేళ్ల వరకు కూడా ఖైదీలు తమకు స్వేచ్ఛ లభిస్తుందనీ భవిష్యత్తులో చక్కగా వుండవచ్చుననీ కలలు కంటారు. ఆ తరవాత నిరాసక్తంగా తయారై దిగజారిపోతారు.

శిక్షాస్మృతిలో యీ కింది మార్పులు చేయాలని శాస్త్రజ్ఞులు ప్రతిపాదిస్తున్నారు: 1 జైలు శిక్షలు

కాక యితర రకాల శిక్షలనే వీలైనంత మేరకు వేయాలి. 2 జైలు శిక్ష గరిష్ఠ కాలాన్ని తగ్గించాలి. మైనర్ల విషయంలో అది ఏడేళ్లకు మించకూడదు. 3 చేసిన నేరం ఒక పథకం ప్రకారం చేసింది కానప్పుడు లేదా ఆ నేరం అంత దారుణమైనది కానప్పుడు నిందితుణ్ణి ప్రత్యేకమైన సంస్కరణ కేంద్రాలకు పంపవచ్చు. అక్కడ కొంత మేరకు ఆర్థిక పరమయిన నిర్ణయాలు చేసుకోడానికి, రోజు వారీ ఎంపికలకు అవకాశాలు వుంటాయి.

పైగా ప్రస్తుతం మార్పులు జరుగుతున్న యీ పరిస్థితిలో శిక్షలపై దృష్టి కేంద్రీకరించేవారు జీవన పునర్నిర్మాణానికి సమాజ కృషి నుంచి దృష్టిని ప్రక్కకు మళ్లించే వారే అవుతారు.

## నేరస్తుడిని గౌరవించాలి

1919 లో మనుగడ కోసం పోరాడుతున్న పరిస్థితిలో సైతం రష్యన్ సమాఖ్యలో నేర చట్టానికి మార్గదర్శక సూత్రాలను సోవియట్ రిపబ్లిక్ ఆమోదించింది. శాంతి భద్రతలకు భంగం కలగకుండా రక్షించేందుకు, అదే సమయంలో నేరస్తునికి బాధ సాధ్యమైనంత తక్కువగా వుండేట్లు చూసేందుకుగాను ఆయా కేసుని బట్టి, ఆయా నేరస్తుని వ్యక్తిత్వాన్ని బట్టి శిక్ష విధింపులో తేడాలుండాలని మార్గదర్శక సూత్రాల 25 వ ఆర్టికల్ నొక్కి చెప్పింది.

''శిక్ష అనేది ప్రయోజనయుతంగా వుండాలి అదే సమయంలో ఏ విధంగానూ చిత్రహింసలు పెట్టరాదు, నేరస్తుడిని అనవసరంగా బాధించరాదు.''

సహజ మానవతావాదం ఏ సమాజానికైన అవసరం. అది అలావుంచి ఆచరణవాదాన్ని మార్గదర్శకంగా పెట్టుకున్నా ఒక నిందితునకు తనను తాను గౌరవించుకొనే అవకాశం వుండాలి. అతడు శిక్ష గడువుపూర్తి అయాక ఆత్మ విశ్వాసంతో బయటి ప్రపంచంలోకి రావాలని, సమాజానికి ప్రమాదకరంగా కాక యితరులతో కలిసిపోయి జీవించాలనీ మనం కోరుకుంటున్నట్లయితే అందుకు అతడికి ఆత్మగౌరవం వుండాలి. ఇది కొందరికి వింతగా అనిపించవచ్చు. కాని నిందితులు నిజంగా నేరస్తులే అయినప్పటికీ వారిపై గౌరవం వుండాలి.

## దయా భిక్ష

''దయా భిక్ష'' అనే పదం వాడకం నుంచి తొలగిపోయింది. ఎందువల్ల? శిక్ష, ఆంక్షలు, కౌర్యం యివే తిరుగులేని వన్న భావన యిందుకు ఒక కారణమని నా అభిప్రాయం. పోరాడటం, నిర్మూలించడంపై మనం మరీ దీర్ఘకాలంపాటు మరీ పూర్తిగా కేంద్రీకరించాం. అది చాలా అవసరమే. అయితే తోటలో నుంచి అన్నీ పెకిలించివేస్తూ కొత్తగా మొక్కలు నాటకపోతే పంట ఎక్కడినుంచి వస్తుంది?

స్టాలినిజం వుండిన సంవత్సరాలు అలాటి భావనలు నిలదొక్కుకోవడానికి అనుగుణమైన కాలం. ''గుడ్డును పగలగొట్టకుండా ఆమ్లెట్ వేయలేం'' అని లావ్రెంతి బేరియా అంటూండేవాడు. న్యాయ, శాసన నిర్వాహకులుగా వుండిన బేరియా వంటి వారు చట్టాలను కఠినతరం చేయడానికి నడుంకట్టారు. కోర్టు బయట శిక్ష అమలు వంటివి వారు ప్రవేశపెట్టిన విషయం యీనాటి యువకులకు తెలియకపోవచ్చు. న్యాయస్థానానికి బదులుగా పీపుల్స్ కమిస్సారియట్‌లోని అంతరంగిక వ్యవహారాల శాఖకు చెందిన వారి ''ప్రత్యేక సమావేశం''లో, ''గుప్తనామములుగల ముగ్గురు'' విచారణ జరిపి శిక్షలు విధించేవారు. నిందితుడు గాని ప్రాసిక్యూటరు గాని, డిఫెన్స్ న్యాయవాది గాని లేకుండా శిక్షలు విధించేవారు. నిధుల దుర్వినియోగానికి శిక్ష విధించేందుకు 1932 లో ఆమోదించిన చట్టం గురించిగాని, పనికి ఆలశ్యంగా వచ్చినందుకు లేదా అప్పగించిన ఉత్పత్తి కోటాను నెరవేర్చడంలో వైఫల్యానికి జైలు శిక్ష విధించేందుకు 1940 లో ఆమోదించిన చట్టం గురించిగాని నేటి యువకులకు తెలియకపోవచ్చు.

పరమసత్యాన్ని కనుగొనడం అసాధ్యం అన్న గతితార్కిక పదార్థవాద నియమానికి భ్రష్ట రూపంలో భాష్యం చెపుతూ ఆనాటి సోవియట్ ప్రాసిక్యూటర్ జనరల్ ఆంద్రివైషిన్‌స్కీ, న్యాయానికి సాపేక్షిక సత్యం చాలునని ప్రకటించాడు. నేరస్తుడు తన తప్పును అంగీకరిస్తే చాలు అదే

అసలు రుజువు అన్నది వారి వైఖరి. అలా నేరస్తుడు అంగీకరిస్తే కేసును క్షుణ్ణంగా విచారించడానికి డిఫెన్స్ వాదనలు వినడం గాని చేసే వారు కాదు. యీ సాపేక్షిక సత్యాన్ని అంటే నేరస్తుని ఒప్పుకోలును ఏ పద్ధతులోనైనా రాబట్ట వచ్చు.

## స్టాలిన్ కాలంలోని 'సువ్యవస్థ' గురించిన భ్రమలు

స్టాలిన్ తరహా "సువ్యవస్థ" గురించి సోవియట్ ప్రజలలో కొందరికి యిప్పటికీ భ్రమలుండం విచారకరం. ఇప్పుడందరిలో క్రమ శిక్షణ పోయిందనీ, స్టాలిన్ పాలనలో అయితే యిలాటిది జరిగే అవకాశమే వుండివుండేది కాదని వారంటుంటారు. వారికి సమాచారం లేక పోవడమే బహుశా అందుకు కారణం. స్టాలిన్ యుగంలో "సువ్యవస్థ" వుండేది అన్నది భ్రమ. ఆనాటి నేరాల స్థితి యిప్పటికన్నా ఎంతో అధ్వాన్నంగా వుండేది. 1930 ల ఆరంభంలో అంతటి భారీ స్థాయిలో అణచివేతలు సాగాయి అంటే అదే ఏ విధమయిన సువ్యవస్థ? అలా అయితే క్రమబద్ధం చేసిన చట్ట రాహిత్యాన్ని కూడా సువ్యవస్థ అనే అనాలి. చరిత్రలో అలాటి వుదాహరణలెన్నో వున్నాయి.

ప్రజాస్వామ్యాన్ని విస్తరిస్తే ప్రజల్లో క్రమ శిక్షణ పోతుందనే వాదన అంత అమాయికమయిన దేమీ కాదు. ప్రజాస్వామ్యాన్ని అవ్యవస్థతో పోల్చడం దారుణం. ప్రజాస్వామ్యం అంటే అరాజకం కాదు. విశృంఖలత్వమూ కాదు. సమాజంలోని యితర సభ్యుల హక్కుల క్కు భంగకరం కాకుండా వ్యక్తి స్వేచ్ఛా జీవితాన్ని గడిపేందుకు హక్కులను నిర్ధారించి వాటి అమలుకు గ్యారంటీ యిచ్చే వ్యవస్థ ప్రజాస్వామ్యం.

**సంపూర్ణ ప్రజాస్వామ్యమంటే భయమెందుకు?**

సోవియట్ ప్రజలలో కొందరికి సంపూర్ణమైన ప్రజాస్వామ్యమంటే భయమని నా అభిప్రాయం అన్ని రకాల పరిమితులు విధింపు, నిషేధించని విషయాలలో సైతం అనుమతి కోరడం అనేది అలవాటు అయిపోయింది.

ఈ "అర్ధ - ప్రజాస్వామ్యానికి" విధేయత అనేది అన్ని తరగతుల ప్రజలకూ ఒక లక్షణమైంది. వ్యక్తి శ్రమ కార్యకలాపాలపై చట్టం నా వుద్దేశ్యంలో వైరుధ్యపూరితమైంది. కొన్ని రకాల పనులు వారు చేయకూడదని జాబితా యిచ్చారు. అయితే అలా నిషేధించే పనులకు కూడా అనుమతి కావాలన్నారు. వ్యంగ్య రచయిత మిహాయిల్ ఝువనెత్‌స్కీ "నువ్వెందుకు నడుస్తున్నావో ముందుచెప్పు. ఆ తరువాత నీయిష్టం వచ్చింత నడువు" అన్నట్లే యిది వుంది. హక్కుని ఈ చట్టం ప్రత్యేక హక్కుగా భాష్యం చెబుతున్నది. వాస్తవ సామాజిక పరిస్థితులకన్నా యీ చట్టం వెనుకబడి వుందని అందువల్ల సామాజిక ఆర్థిక రంగాలలో పునర్నిర్మాణ వేగాన్ని తగ్గిస్తుందని నా అభిప్రాయం.

మనకు! కావాల్సింది రిజిస్ట్రేషన్ క్రమం. అనుమతికీ దీనికీ తేడా వుంది.

మన శిక్షాస్మృతిలో సైతం "అర్ధ ప్రజాస్వామ్య"న్ని అధిగమించడం యింకా జరగాల్సి వుంది. 1966 లో రష్యన్ ఫెడరేషన్ శిక్షాస్మృతిలో 190-1 ఆర్టికల్‌ను ప్రవేశపెట్టారు. సోవియట్ రాజ్యంపై, పౌర వ్యవస్థపై కట్టుకధలను దుష్ప్రచారాన్ని నోటి మాటగా గాని యితర రూపాలలోగా ని సాగిస్తే యీ నిబంధన కిందే శిక్షించ వచ్చు. కఠినమైన విమర్శలకు, భాధ్యతా రహితమయిన తెలివితక్కువ మాటలకు 190-1 వర్తిస్తుంది. అందువల్ల యీనాడు, కఠిన విమర్శలు, వివాదాస్పద అభిప్రాయాలు, పొరపాటు అభిప్రాయాలు సైతం పత్రికలో టెలివిజన్లద్వారా అత్యున్నత స్థాయిలో కూడా వ్యక్తమవుతున్న యీ సమయంలో 190 - 1 నిబంధనకు కాలం చెల్లిందని నా ధృడాభిప్రాయం. ఈ వి. ధమయిన విమర్శలనే మనం సాధారణ స్థితి అని పిలుస్తున్నాం.

(ఒగొన్యక్ వారపత్రిక నుంచి సంక్షిప్తం)

# వర్ధమాన దేశాల సమస్యల పరిష్కారాన్ని అడ్డుకుంటున్న దేమిటి

ప్రొఫెసర్ ఇ.ఓబ్‌మిన్‌స్కీ
డి.ఎస్సీ (అర్థశాస్త్రం)
*సోవియట్ యూనియన్*
*విదేశ వ్యవహారాల మంత్రిత్వశాఖలో*
*ఒక విభాగ అధిపతి*

సామ్రాజ్యవాద వలస వ్యవస్థ పతనం, వర్ధమాన దేశాల రాజకీయ స్వాతంత్ర్య సముపార్జన — యివి పాశ్చాత్య ప్రపంచానికీ, అనేక వర్ధమాన దేశాలకూ మధ్య ఆర్థిక సంబంధాలను రూపంలోను, వస్తువులోను గణనీయంగా మార్చివేశాయి. అయితే , ఈ మార్పులన్నీ వర్ధమాన దేశాలను దోపిడీ బారినుండి కాపాడలేవు.

బహుళా జాతి గుత్త పెట్టుబడి కార్యకలాపాల ద్వారానూ, పరపతి మంజూరు చేయడానికి సంబంధించిన కార్యకలాపాల ద్వారానూ, విదేశీ రుణాలివ్వడం ద్వారానూ, అంతర్జాతీయ శ్రమవిభజనలో ఉద్దేశపూర్వకంగా "సాంకేతిక వలసవాదాన్ని" రుద్దడం తదితర పద్ధతుల ద్వారానూ యిప్పుడు ఈ దోపిడీ జరుగుతోంది.

## రుణాలు

సామ్రాజ్యవాద విధాన దోపిడీ సారాంశం అంతర్జాతీయ ఆర్థిక సంబంధాల్లోని ద్రవ్య-ఆర్థిక రంగంలో, ప్రత్యేకించి సుస్పష్టంగా, వ్యక్తమవుతోంది. *1977* నాటినుండీ నవస్వతంత్ర దేశాలు విదేశీరుణాల కింద చేసే చెల్లింపులు నాలుగు రెట్లకు పైగా అంటే, *120-140* బిలియన్ల

డాలర్లకు పెరిగాయి; యీమొత్తం వర్ధమాన దేశాలకు ఎగుమతుల ద్వారా వచ్చే ఆదాయంతో దాదాపు నాల్గవవంతు.

*1980 ల ప్రథమార్ధంలో రుణాలపై వడ్డీలను చెల్లించేందుకై కొన్ని దేశాలు తమ ఎగుమతుల ఆదాయంలో మూడవ వంతు నుండీ ఐదింట రెండువంతుల వరకూ చెల్లించాల్సి వచ్చింది. ఈ సమస్య లాటిన్ అమెరికా దేశాల్లో ప్రత్యేకించి తీవ్రంగా ఉంది. 1982-85 కాలంలో ప్రధానమైన ఏడు రుణగ్రస్తలాటిన్ అమెరికా దేశాలనుండి బయటి దేశాలకు పోయిన మొత్తం ధనం దాదాపు 85 బిలియన్ల డాలర్లు ఉండిందని* **అంక్టాడ్** *కార్య దర్శి వర్గ నివేదిక తెలుపుతోంది. 1982-84 కాలంలో కొన్నిలాటిన్ అమెరికా దేశాలు తమ మొత్తం ఉత్పత్తిలో 10 శాతం, లేక ప్రభుత్వానికి వచ్చిన ఆదాయంలో సగాన్ని విదేశాలకు బదిలీచేయాల్సి వచ్చిందని ఇదే నివేదిక తెలిపింది.*

*1986 సంవత్సరపు ఐ.ఎం.ఎఫ్ నివేదిక ప్రకారం, తృతీయ ప్రపంచం రుణాలు మరో 9 శాతం అంటే మొత్తం 1,100 బిలియన్ల డాలర్లు, అంటే ఆ దేశాల ఎగుమతి అమ్మకాల్లో 69 శాతానికి పెరిగాయి. ఫలితంగా వాటి జాతీయ ఆర్థిక ఆదాయవ్యయ పద్దులో మొత్తం 46 బిలియన్ల డాలర్ల లోటు ఏర్పడింది.*

పాశ్చాత్య దేశాలు తామిచ్చే మధ్యకాలిక, దీర్ఘ కాలిక రుణాలను తగ్గించడంతో, వర్ధమాన దేశాల ద్రవ్య - ఆర్థిక దుస్థితి మరింత అధ్వాన్నం అయిపోయింది. యివి 1985 లో, 1981 నాడు లభించిన రుణాలకన్నా 20 శాతం తగ్గిపోయాయి.

## అన్యాయమైన వ్యాపారం

అంతర్జాతీయ వ్యాపారంలో పాశ్చాత్య దేశాలు వర్ధమాన దేశాలను పకడ్బందీగా కొల్లగొడు తున్నాయి.

పాశ్చాత్య దేశాలు వర్ధమాన దేశాలనుండి దిగుమతి చేసుకునే సరకుల్లో రక్షణ సుంకాలతో సంబంధంలేని వాటిలో 2౦ శాతంపై పరిమితులు విధించడం జరిగింది. కాని, అభివృద్ధి చెందిన పెట్టుబడి దారీ దేశాల నుండీ దిగుమతి అయ్యే యిలాంటి సరకుల్లో 21.1 శాతంపై మాత్రమే యీ పరిమితులు విధించారు. పారిశ్రామిక సరకుల విషయంలో యీ సంఖ్యలు వరుసగా 31 శాతం, 17.8 శాతం, ఉన్నాయి. జనపనార, దుస్తుల విషయంలో యివి వరుసగా 73.4; 28.2 శాతం.

కాబట్టి, వర్ధమాన దేశాలు తమ రుణభారం తగ్గించుకోవడం కోసం తమ ఆర్థిక వ్యవస్థను పారిశ్రామికీకరించుకోవడానికి చేసే కృషికి తీవ్రమైన ఆటంకాలు ఎదురవుతున్నాయి. తరచుగా ఈకృషిని పాశ్చాత్యదేశాల స్వార్థపూరిత వాణిజ్య విధానం వమ్ము చేస్తోంది.

అంతర్జాతీయ వ్యాపార రంగంలోని వ్యవసాయ విభాగంలో వర్ధమాన దేశాల పరిస్థితి బహు తీవ్రంగా ఉంది. ఈ రంగంలో పరిమితులను ఒ.ఇ.సి.డి. సగానికి తగ్గించినా ఈ దేశాలకు సంవత్సరానికి మరో 6 బిలియన్ల డాలర్లు లభిస్తాయి. 1980-86 లో ముడిపదార్థాల ధరలు అసలు విలువలో 30 శాతం తగ్గడంతో అభివృద్ధి చెందిన పెట్టుబడి దారీ దేశాలకు అదనంగా దాదాపు 100 బిలియన్ల డాలర్లు లభించాయి.

ఐ.ఎం.ఎఫ్ అంచనా ప్రకారం 1986 లో వర్ధమాన దేశాల ఎగుమతులు పెరిగినప్పటికీ ఎగుమతి సరకుల ధరలు 26 శాతం పడిపోవడం వల్ల యీదేశాల ఆదాయాలు మునుపటికన్నా తగ్గాయి.

## మేధావుల వలస

ఇటీవలి సంవత్సరాల్లో వర్ధమాన దేశాల నుండి పారిశ్రామిక పెట్టుబడి దారీ దేశాలకు మేధావుల వలస పెరిగింది. 1961 లో అమెరికాకు వలస వచ్చిన వారిలో వర్ధమాన దేశాల వారు 40 శాతం ఉండగా 1970 లో వారి సంఖ్య 75 శాతానికి పెరిగిందని **అంక్టాడ్** లెక్కలు తెలుపుతున్నాయి. ఈ వలస వల్ల అమెరికాకు ఏటా విద్యారంగానికి కేటాయించవలసిన మొత్తంలో సగటున 1,800 మిలియన్ల డాలర్లు పొదుపు అవుతున్నాయి. మేధావుల వలస వల్ల వర్ధమాన దేశాలకు కలిగిన హాని ఈ కింది విధంగా ఉంది:

— వలస పోయిన నిపుణుల శిక్షణకైన ఖర్చు. 1970 లలో యీనష్టం ఒక్కొక్క వర్ధమాన దేశానికి సగటున సంవత్సరానికి 320 మిలియన్ల డాలర్లు ఉండింది;

— చదువుపూర్తి అయిన తర్వాత స్వదేశానికి తిరిగి రాని విద్యార్థులున్నారు. వారి శిక్షణకయ్యే ఖర్చు — మరో 700 మిలియన్ల డాలర్లు;

— వలస పోయిన నిపుణులు తయారు చేయగల సరకుల, లేక చేయగల సేవల కొనుగోళ్ల వల్ల యేటా 3,000 మిలియన్ల డాలర్లు

— స్వదేశానికి పంపించుకునే డబ్బుపై విధించే పరిమితుల వల్ల, ఒ.ఇ.సి.డి. రాజ్యాల్లో వర్ధమాన దేశాల నుంచి వచ్చిన నిపుణులపైన విధించే వివక్షా పూరితమైన పన్నుల వల్ల వారు స్వదేశానికి పంపే మొత్తాలు తగ్గిపోడం. ఫలితంగా కలిగిన నష్టం — ఏటా 1500 మిలియన్ల డాలర్లు.

దీన్నంతటినీ సమాహరించి చెప్పాలంటే, మేధావులు వలస పోవడంవల్ల వర్ధమాన దేశాలకు ఏటా 8000 మిలియన్ల డాలర్లు (1975 ధరల ప్రకారం) నష్టం వస్తోంది. అంచనా వేయడం సాధ్యంకాని పరోక్ష ఆర్థిక, సామాజిక నష్టాలను ఈ సంఖ్యలో చేర్చలేదు.

వైద్యుల వలస వల్ల వర్ధమాన దేశాలకు ప్రత్యేకించి హాని జరిగింది. యుద్ధానంతరకాలంలో 130,000 మంది వైద్యులు తృతీయ ప్రపంచ దేశాలనుండీ అభివృద్ధి చెందిన పెట్టుబడి దారీ దేశాలకు వలస వెళ్ళారు. అందువల్ల వైద్య సదుపాయంలేక అంటువ్యాధుల వల్ల వర్ధమాన దేశాల్లో యెందరో మరణిస్తున్నారు.

## దోపిడీ విధాన దుష్ఫలితాలు

వర్ధమాన దేశాల్లోని జి.డి.పి. సగటు వార్షిక పెరుగుదల రేటు గణనీయంగా పడిపోవడం అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలు అనుసరిస్తున్న దోపిడీ విధాన ప్రత్యక్ష ఫలితమే. 1975-80 లో ఆ దేశాల్లో జి.డి.పి సగటు వార్షిక పెరుగుదల రేటు 5 శాతంపైన ఉండగా, 1980-84 లో అది 1 శాతానికి పడిపోయింది. దీని ఫలితంగా వర్ధమాన దేశాలకూ అభివృద్ధి చెందిన దేశాలకూ మధ్య జీవన పరిమాణాల్లో అంతరం చాలా పెరిగింది.

అతి తక్కువగా అభివృద్ధి చెందిన దేశాల్లో పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది.

పాశ్చాత్య దేశాలు పరిహారంగాయిస్తున్న ఆర్థిక సహాయ పద్ధతుల (ఐ.ఎం.ఎఫ్, లోమ్ ఒడంబడిక పరిధిలో) వల్ల ఉపశమనం అంతంత మాత్రంగానే ఉంటోంది. ఉదాహరణకు, ఎగుమతి ఆదాయాలను స్థిరంగా ఉంచేందుకు అమలు జరుగుతున్న ప్రాజెక్టులో (స్టాబెక్స్) పాల్గొంటున్న వర్ధమాన దేశాలకు 1980-84 లో జరిగిన నష్టాల్లో పరిహారంగా నాలుగు శాతం మాత్రమే ముట్టింది.

వర్ధమాన దేశాలకూ, అభివృద్ధి చెందిన పెట్టుబడి దారీ దేశాలకూ మధ్య యిప్పుడున్న ఆర్థిక సంబంధాల వ్యవస్థ వెనుక బాటు తనం సమస్య పరిష్కారాన్ని అడ్డుకొంటోందనేది స్పష్టమే. ఈ రెండు బృందాలకు చెందిన దేశాల ప్రయోజనాలు ఎంత భిన్నంగా, పరస్పర విరుద్ధమైనవిగా ఉన్నాయంటే, వీటి మధ్య సామరస్యాన్ని సాధించడం అతిగడ్డు సమస్యగా కనిపిస్తోం ది. అయినప్పటికీ, ఇప్పటికీ పరిస్థితి ఆశావహంగా లేకపోలేదు. అనేక వర్ధమాన దేశాలను దోపిడీకి గురయ్యే నిరాధారస్థితిలో వదిలి వెయ్యడం ద్వారా మనం అణుయుద్ధ మంతటి మహా ప్రమాదంలో పడుతున్నామని అంతకంతకూ యెక్కువ మంది రాజకీయ వేత్తలు గ్రహిస్తూండటమే ఈ ఆశాభావానికి కారణం.

ఈ పరిస్థితి తీవ్రతను గ్రహించి, సోవియట్ యూనియన్ అనేక చొరవలు తీసుకొంది. అతి తక్కువ అభివృద్ధి చెందిన దేశాల విషయంలో బ్యాంకుల రుణాలపై వడ్డీ తగ్గించి, వాటికి అదనపు సదుపాయాలు కల్పించాలని ప్రతిపాదించింది. సైనిక బడ్జెట్టు తగ్గింపు వల్ల విడుదలయ్యే నిధుల్లో కొంత భాగాన్ని వర్ధమాన దేశాల ప్రయోజనాల కోసం వినియోగించాలని ప్రతిపాదించింది. సోవియట్ చొరవలకు ప్రపంచంలో లభించిన విస్తృత తోడ్పాటును ఆ చొరవలు మొత్తంగా ప్రపంచ మానవాళి ప్రయోజనాలనూ, వర్ధమాన దేశాల ప్రయోజనాలనూ తీర్చగలవన్న నిర్ధారణకు రాక తప్పదు.

# వర్ధమానదేశాలూ, నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ

ప్రొఫెసర్ ఎస్.జె.ఆర్. బిల్‌గ్రామీ

అభివృద్ధి చెందిన దేశాలకూ, అభివృద్ధిచెందుతున్న దేశాలకూ మధ్య అఖాతం తగ్గడానికి బదులుగా నానాటికీ పెరుగుతోంది. యిది ప్రస్తుత ప్రపంచ పరిస్థితిలోని ఆందోళన కరమైన అంశాల్లో ఒకటి. అభివృద్ధి చెందిన దేశాల్లోని జనాభా ప్రపంచ జనాభాలో 23 శాతం మాత్రమేవుంది. కాగా యీదేశాలు ప్రపంచ వనరుల్లో 77 శాతం వినియోగించుకుంటున్నాయి. ప్రపంచజనాభాలో 77 శాతం ప్రజలు వున్న వర్ధమానదేశాలు మిగతా 23 శాతం వనరులను వినియోగించుకుంటున్నాయి. యీ పరిస్థితి తీవ్ర అసమానతను సృష్టించింది. యీ పరిస్థితి, వర్ధమాన దేశాలు నిరంతరం వెనుకబాటు తనంలో వుండిపోతున్నాయనడానికి సంకేతం మాత్రమే కాక రాజకీయ, ఆర్థిక అస్థిరత్వాన్ని కూడా సృష్టిస్తోంది. యీ పరిస్థితిని చక్కబర్చడానికి నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థను నెల కొల్పాలని వర్ధమాన దేశాలు డిమాండ్ చేస్తున్నాయి. వనరులను మరింత న్యాయ సమ్మతంగా పంపిణీ చేయడం యీ వ్యవస్థ వుద్దేశ్యం.

### న్యాయసమ్మతంగా వనరుల పంపిణీ

ఈ డిమాండును అమలు పర్చుకోవడంలో వర్ధమాన దేశాలకు యెన్నో సమస్యలు యెదురౌతున్నాయి.

ద్వైపాక్షిక ఒప్పందాలని ఒకవైపు, బహుళపక్ష ఒప్పందాలని మరో వైపు వాదనలు చెలరేగుతున్నాయి. ద్వైపాక్షిక ఒప్పందాలే సముచితమైనవని అభివృద్ధి చెందిన దేశాలు పట్టుబడుతున్నాయి. వీటి ద్వారా అవి తమ ప్రయోజనాలను రక్షించుకోగలవు. యీ ఒప్పందాల్లో చాలా తరచుగా రాజకీయ షరతులు యిమిడి వుంటాయి. యిలాంటి రాజకీయ వత్తిడులు లేని బహుముఖ సహాయానికి వర్ధమాన దేశాలు ప్రాధాన్యతనిస్తున్నాయి.

ఆధునికతకు భిన్నమైనది మూసపోత. యిది మరో సమస్య. అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలకు బదిలీ చేయడానికి అభివృద్ధి చెందిన దేశాలు వ్యతిరేకం. వర్ధమాన దేశాలను మునుపటిలాగానే తమ సరకులను అమ్ముకునే మార్కెట్లుగా అభివృద్ధి చెందిన దేశాలు పరిగణిస్తున్నాయి. వర్ధమాన దేశాల్లో యెలాంటి స్వరూప సంబంధమైన మార్పులనైనా సరే అవి నిరోధిస్తున్నాయి. అధునికీకరణకు స్వరూప

సంబంధమైన మార్పు అవసరం. వర్ధమాన దేశాల్లో స్వరూప సంబంధమైన మార్పులను అభివృద్ధి చెందిన దేశాలు నిరుత్సాహ పర్చడానికి కారణాలు యివి: మొదటిది యీ మార్పులవల్ల స్వల్ప వ్యవధిలో ఆదేశాలనుండి యెలాంటి లాభాలను ఆశించడానికి వీలువడదు. రెండవది, యిదే జరిగితే దీర్ఘకాలంలో తమ సరకులకు మార్కెట్లు తగ్గిపోతాయని వాటి భయం.

## ప్రయోజనాల ఘర్షణ

వ్యవసాయానికీ, పరిశ్రమలకూ సంబంధించిన సమస్య ఒకటుంది. వర్ధమాన దేశాలు తమకు ముడి సరకులను సప్లయి చేసే దేశాలుగానే వుండాలని అభివృద్ధి చెందిన దేశాల కోరిక. అలా ఉన్నట్టయితే తమ పారిశ్రామిక సరకులకు వర్ధమాన దేశాలు రెడీమేడ్ మార్కెట్టుగా వుపయోగపడుతాయి. కాగా వర్ధమాన దేశాలు సత్వర పారిశ్రామికీకరణను కోరుకుంటున్నాయి. యిది వాటి వ్యవసాయరంగాభివృద్ధికి అవసరం. పాశ్చాత్య పారిశ్రామిక దేశాలపై అవి ఆధారపడడాన్ని కూడా యిది తగ్గిస్తుంది.

వర్ధమాన దేశాల్లోని ప్రయివేటు రంగానికి సహాయం చేయడమంటే పెట్టుబడిదారీ దేశాలకు యిష్టం. యిందుకు వాటి స్వార్థ ప్రయోజనాలేకారణం. కాగా **వర్ధమాన** దేశాల సర్వతో ముఖాభి వృద్ధికి, తమ ప్రజల సంక్షేమానికి అవి ప్రభుత్వ రంగాన్ని అభివృద్ధి చేసుకోవడం అవసరం.

## పరాధీనత, పరస్పరాధీనత

వర్ధమాన దేశాలు యెదుర్కొంటున్న యీ సమస్యలన్నిటికీ కారణం పరాధీనతకూ, పరస్పరాధీనతకూ మధ్య గల వైరుధ్యమే. వర్ధమాన దేశాల విదేశీరుణ భారాన్నే తీసుకోండి. యీ విదేశీరుణ భారం అనేక వర్ధమాన దేశాలకు తీవ్ర సమస్యల్లో ఒకటైంది. యీ సమస్యకు మూలం వలసవాదం; దాన్ని నయావలసవాదం యింకా వుధృతం చేస్తోంది. యిది వాస్తవంతో ఒక ప్రపంచస్థాయి రూపాన్ని సంతరించు కున్నది.

దోపిడియే ప్రధాన లక్ష్యంగా గల అభివృద్ధిచెందిన దేశాల పరపతి విధానం, వర్ధమానదేశాలకు అనుకూలంగా లేని వాటి వాణిజ్య షరతులు — యివి వర్ధమాన దేశాల విదేశీ రుణ భారాన్ని పెంచాయి. యిది యిప్పుడు ట్రిలియన్ డాలర్లకు మించివుంది. యీ రుణాల వడ్డీలకే యీ దేశాల సంచిత నిధిలో ఐదింట ఒక వంతు, ఎగుమతుల వల్ల వచ్చేఆదాయాల్లో మూడింట ఒక వంతు హరించుకపోతోంది. యీ దేశాల విదేశీరుణ భారం విపరీతంగా పెరగడానికి కారణం యీ విధానమే.

సమస్వతంత్ర దేశాల అభివృద్ధి ప్రయోజనాలను పరిశీలనలోకి తీసుకోవడంతో పాటు ప్రపంచ ఆర్థిక వ్యవస్థ నికర, సమరసాభివృద్ధిని దృష్టిలో ఉంచుకునే ప్రపంచస్థాయి, న్యాయ పద్ధతుల ద్వారా మాత్రమే విదేశీ రుణభార సమస్యను పరిష్కరించ వీలుంటుంది. యేకపక్ష నిర్ణయాలు, చట్ట విరుద్ధ నిషేధాలు, బహిష్కరణలు, వాణిజ్య పరమైన పరపతి విధానం, సాంకేతిక దిగ్బంధం, రాజకీయ వత్తిడి సాధనంగా ఆర్థిక సంబంధాలను వినియోగించడం, వివక్షతతో కూడిన చర్యలు, ఆచరణలు, దిగుమతుల నిరోధానికి విపరీతమైన సుంకాలు, పరిమితుల విధింపు

వీటన్నిటినీ అంతర్జాతీయ ఆర్థిక సంబంధాల నుండి తొలగించాలి. వర్ధ మాన దేశాల పరిస్థితిని సమూలంగా మెరుగు పర్చడానికి యిది అవసరం.

**ఆయుధాల తగ్గింపు, నిరాయుధీకరణ**

ఆయుధ పోటీవల్ల, ముఖ్యంగా అణ్వా యుధ పోటీవల్ల యిటీవలి కాలంలో అంతర్జాతీయ వుద్రిక్తతలు పెచ్చు పెరిగా యి. శాంతిని పరిరక్షించడానికి, వుద్రిక్తత లను తొలగించడానికి, మానవాళి యీనా డెదుర్కొంటున్న తీవ్ర ఆర్థిక సమస్యలను తిరుగులేని విధంగా పరిష్కరించడానికి ఆయుధాల తగ్గింపు, నిరాయుధీకరణ తప్పనిసరైన షరతు.

అభివృద్ధికీ, నిరాయుధీకరణకూ మధ్య సన్నిహిత సంబంధముంది. ఆర్థిక వెనుక బాటు తనాన్ని అధిగమించడానికి అదన పువనరుల విడుదల అనేది నిరాయుధీ కరణ వల్లనే సాధ్యం. సైనిక వ్యయాల తగ్గింపు వల్ల యీ వనరులను పొందవచ్చు. యీ విధంగా విడుదలైన పాదార్థిక, ఆర్థిక, మానవ, విజ్ఞాన శాస్త్రవనరులతో ఆయాదే శాల ఆర్థిక, సామాజిక ప్రగతిని త్వరితప ర్చవచ్చు. యిది వర్ధమానదేశాల వెనుకబా టు తనాన్ని తొలగించడానికి తోడ్పడు తుంది. ఆయుధాల పరిమితి, నిరాయుధీ కరణలో పురోగమనం, ముఖ్యంగా అణ్వా యుధాల విసర్జనలో పురోగమనం — యీమార్గంలో వేసే ప్రతి ఒక్క అంజ అభివృద్ధి పనులకు అదనపు నిధులను విడుదల చేసేవిగా వుండాలి.

అంతులేని మహా సముద్రంలాంటి పేదరికం చుట్టుముట్టి వున్న ద్వీపంలాగా సౌభాగ్యాలతో తులతూగే అభివృద్ధి చెందిన దేశాలున్నాయి. యీ దేశాలు యెప్పటికైనా మేల్కొని సక్రమంగా వ్యవహ రించకపోతే సౌభాగ్యంతో తులతూగే యీ ద్వీపాన్ని విశాల సాగరం లాంటి పేదరికం నామరూపా ల్లేకుండా చేస్తుంది. అభివృద్ధి చెందిన దేశాలకు యిలాంటి గ్రహింపు వచ్చేవరకూ నూతన, న్యాయమైన, సమాన ఫాయీ ఆర్థికవ్యవస్థ కోసం చేస్తున్న డిమాండ్‌ను సాధించు కోడానికి వర్ధమాన దేశాలు తగు పోరాటాన్ని సాగించాల్సి వుంటుంది.

## మే 9, విజయోత్సవ దినం

# చరిత్ర గుణపాఠం




కల్నల్-జనరల్
వోల్కో గోనోవ్

ప్రొఫెసర్, డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ


మన చరిత్రలో భాగమైన గతం మన దృక్పథంలో ముఖ్యమైన అంశం. చరిత్ర పరిజ్ఞానం ప్రజల యింగిత జ్ఞానాన్ని పెంచుతుంది. గత అనుభవంపై ఆధారపడి వారు ఆధునిక సమస్యలను పరిష్కరించ గలుగుతారు; భవిష్య ద్దర్శనం చేయగలుగు తారు. ఈ నాడిది అతి ముఖ్య విషయం. రెండు ప్రపంచ యుద్ధాలు జరిగిన విషయం మనకు తెలిసిందే. ప్రాణాంత కమైన పర్యవసానాలతో కూడుకున్న మూడవ ప్రపంచ యుద్ధాన్ని మనం తప్పించ గలమా? అలా తప్పించక పోయినట్లయితే మానవాళి ప్రమాదంలో పడిపోతుంది. యుద్ధాన్ని తప్పించగ లమని రెండవ ప్రపంచ యుద్ధం గుణపాఠాలు ప్రజలకు బోధిస్తున్నాయి.

గత ఐదువేల సంవత్సరాల్లో జరిగిన 14,500 యుద్ధాలు 4,000 మిలియన్లకు పైగా ప్రాణాలను — యిది నేటి ప్రపంచ జనాభాకు సమానం — బలిగొన్నాయని చరిత్రకారులకు తెలును.

అణు యుద్ధం జరుగుతుందేమోనని ప్రజలు భీతి చెందుతున్నారు. వారు ఈ భీతావహస్థితిలో సర్వదా వుంటూ అలసి పోయారు. యుద్ధసన్నాహా లను నిరసిస్తున్నారు; యుద్ధాన్ని ఖండిస్తున్నారు.

చరిత్ర చేసిన నిర్ధారణలు ప్రజలకు గతాన్ని గుర్తు చేసే హెచ్చరికలు. గతంలో ఏమి జరిగింద న్న విషయాన్ని ప్రస్తుతం ఏమి జరుగుతుందన్న విషయాన్ని తులనాత్మకంగా పరిశీలించే పద్ధతు లను చరిత్రబోధిస్తుంది. విజయోత్సవదినాన్ని జరు పుకుంటూ మనం రెండవ ప్రపంచ యుద్ధ గుణ పాఠాలను మరోసారి గుర్తు చేసుకుంటున్నాం. ప్రపంచాధిపత్యం కోసం, సమస్త జాతులపై పెత్తనం కోసం చేసే ప్రయత్నం విఫలం కాక తప్పదు, అన్నది ఈ గుణపాఠాల్లో ఒకటి. అలాంటి వైఫల్యానికి అవకాశం లేదని నమ్ముతూ తూర్పుదేశంపై "పవిత్ర యుద్ధానికి" సిద్ధపడటం ద్వారా నాజీ నాయకులు సామాజికాభివృద్ధి నియమాలను ధిక్కరించారు. 1939 లో నాజీ సాయుధదళాల అగ్రనాయకుల

నుద్దేశించి ప్రసంగిస్తూ హిట్లర్ దురహంకారంతో ఇలా చెప్పాడు: "మనం సోవియట్ యూనియన్‌ను చిత్తుగా ఓడించి తీరుతాం; ప్రపంచ మంతటా జర్మన్ పాలనను నెలకొల్పి తీరుతాం." నాజీల దురాశలను సోవియట్ ప్రజానీకం, దాని సైన్యం వమ్ముచేశాయి నాజీజం, ఫాసిజాలపై విజయం ఫలితంగా సోషలిజం నేడు ఒక ప్రపంచ వ్యవస్థ అయింది; ఈ నాటి అపారమైన పలుకుబడి గల శక్తులలో ఒకటి అయింది. యిందువల్ల, సైనిక శక్తితో రాజకీయ లక్ష్యాలను సాధించే ఏ ప్రయత్నమైనా విఫలం కాక తప్పని పరిస్థితి ఏర్పడింది. మన రాజ్య రాజకీయ సంకల్పం, దాని అపార ఆర్థిక, సైనిక శక్తీ సైనిక వ్యూహాత్మక సమానతను కొనసాగించగల దాని సామర్థ్యం — యివి దురాక్రమణ దారులు అణుయుద్ధంలో విజయం సాధించే అవకాశం లేకుండా చేస్తున్నాయి. అందువల్లనే, సి.పి.ఎస్.యు రూపొందించిన కొత్త రాజకీయ ఆలోచనా సరళి మన కాలంనాటి వాస్తవాలను పరిగణనకు తీసుకుని, మానవ జీవితం నుంచి అణుయుద్ధాన్ని నిర్మూలించడం ముఖ్యాతి ముఖ్య ధ్యేయంగా పరిగణిస్తోంది. దీన్ని సాధించడం కష్టమే; కాని అశక్యంకాదు.

నాకు తెలిసిన కుటుంబం ఒకటుంది. ఆ కుటుంబంలోని వారు, యుద్ధంలో తగిలిన గాయాల వల్ల మరణించిన తాతగారి చిరిగిన ట్రెంచ్ కోటును, దానితో పాటు ఆయన ఆర్డర్ పతకాలను, కొన్ని మెడల్స్‌ను, ఆయన పోల్గొన్న పోరాటాలలో ఆయన చేసిన సాహసకృత్యాల వార్తలుగల వార్తాపత్రికల భాగాలు గల నోట్‌బుక్‌ను మే 9 న తమ ఇంటి హాలులో ప్రదర్శిస్తారు. ఇలా అమరవీరులను ఆరాధించే కుటుంబాలు యింకా యెన్నో వున్నాయి.

డాకుమెంటరీ ఫోటో



లెనిన్ గ్రాడ్ పోరాటం 1942 శరదృతువు

అమర వీరులను మనం గౌరవ భావంతో సదా స్మరిస్తాము.

మే 9 న మాస్కోలో గోర్కీ పార్కుకు వచ్చే యుద్ధ యోధుల సమూహాలను యెవరూ మర్చిపోలేరు. వారి సంఖ్య క్రమక్రమంగా తరిగి పోతోంది. వారు ప్రతి విజయోత్సవదినాన ఇక్కడ కలుసుకుంటారు. తమ మనుమల తోను, ముని మనుమల తోను గోర్కీ పార్కుకు వస్తుంటారు.

ఇది సోవియట్ ప్రజలకు నీతి బోధక పాఠశాల అనిఅనుకుంటున్నాను. ఉమ్మడి పోరాట స్మృతులూ, విజయోత్సవ దినాన్ని చూచే అదృష్టంలేని మృత వీరుల స్మృతులూ మాత్రమే మాజీసైనికులను జీవన స్రవంతిలో పాల్గొనేలా చేస్తున్నాయి.

ఒక విజయోత్సవ దినంనాడు వృద్ధ సైనికుల సమావేశానంతరం, వారిలో ఒక యోధునితో మాట్లాడాను. అలెక్సీ కుప్త్సేవ్ నాతో ఇలా అన్నారు. "నా తరం వారు అంట యుద్ధరంగంలో ఉండిన మేమందరం ఆ సంవత్సరాలను మర్చిపోలేం. మా సాంప్రదాయిక సమావేశాల సందేశం, మాకు మాత్రమే ఉద్దేశించినది కాదు. మన మాతృ భూమి మనకు సర్వదా పవిత్రమైనదని యువతరం తెలుసుకోవాలి. దేశ గత, ప్రస్తుత, భావితరాల కోసం విజయ సాధనకై పోరాడుతూ అమరవీరులు అసువులు బాశారు."

దురదృష్టకరమైన సంగతేమిటంటే విజయాన్ని సాధించిన వీరుల్లో బతికున్నవారి సంఖ్య అంతకంతకూ తగ్గిపోతూండటం. యుద్ధం ముగిసే నాటికి 19,20 యేళ్ళ ప్రాయంలో ఉండిన వారు కూడా యిప్పుడు అరవయ్యోపడిలో పడ్డారు. నాటి యుద్ధంలో పాల్గొన్న ప్రతి యోధుని పట్ల మనం శ్రద్ధాశక్తులు కలిగి ఉండాలి. ఎందుకంటే వారికి మనమెంతో రుణపడి ఉన్నాం. ప్రఖ్యాత సోవియట్ సైనిక నాయకుడు జార్జి జుకోవ్ ఇలా చెప్పారు.



విమాన యుద్ధం



నాజీనిర్బంధ శిబిరంలోని ఖైదీలు

"సైనికులు శత్రువుపై యెలా దాడి ప్రారంభించే వారో నేను చాలా సార్లు చూచాను. అది చాలా కష్టమైన పని. దూసుకొస్తున్న తుపాకి గుండ్లకు ఎదురు నిలిచి ధైర్యసాహసాలను ప్రదర్శించాల్సి ఉంటుంది. తాము జీవిత ప్రాంగణంలోనే ఉన్న ప్పటికీ, ముందెంతో భవిష్యత్తు ఉన్నప్పటికీ, వీరు అగ్ని పరీక్షకు తట్టుకుని నిలిచారు.
దాడిచేశారు. వారిని గౌరవించడం, వారి పట్ల ఆదరాభిమానాలు చూపడం గతాన్ని స్మరించే సంప్రదాయం పట్ల నిబద్ధతను చూపే ఉత్తమ పద్ధతి. ఇది మన నైతిక విధి."

తమ వీరులను దేశానికి గర్వకారణంగా పరిగణించడం ద్వారా, వారి వీరగాథలను చెప్పడం ద్వారా, వాటిని తరతరాలకు అందించడం ద్వారా ప్రజలు వారిని సదా గౌరవిస్తూనే వచ్చారు.

విజ్ఞాన శాస్త్రానికి, కళలకూ, విప్లవ పోరాటానికి, న్యాయమైన యుద్ధాలకూ అపార దోహదం చేసిన తమ జాతీయ నాయకులను గురించి వివిధ భాషల్లో యెన్నో గ్రంధాలను ప్రకటించారు. ప్రజలు అనేక వస్తుప్రదర్శన శాలలను, స్మారక చిహ్నాలను నెలకొల్పారు. జాతీయ వీరుల వీరోచిత కృత్యాల గురించిన యెన్నో గాథలను చెప్పారు.

ప్రజలు తమ నిజమైన వీరులను సదా గౌరవిస్తూనే ఉంటారు. విజయంకోసం తమ ప్రాణాలను లెక్క చేయకుండా పోరాడిన వారి పేర్లను వారెన్న టికీ మరువరు. తర్వాతి తరాలు వారి సాహస కృత్యాలను గౌరవించినంత కాలం, వాటిని ప్రశంసా భావంతో ఆరాధించినంతకాలం వారి పేర్లు నిలిచే ఉంటాయి. హీరు చరిత్ర గ్రంధాల్లో, నవలల్లో, పాటల్లో, వీరగాథల్లో, స్మారక చిహ్నాల్లో, వస్తుప్రదర్శన శాలల్లోని వస్తు సంచయంలో, పట్టణాలు, వీధులు, చౌకులు, నౌకలు, పాఠశాలలు, నిర్మాణ స్థలాల, పేర్లలో జీవిస్తూనే ఉంటారు.



ఫాసిజం ఓడిపోయింది 1945 బెర్లిన్

విజేత



# మానసికత

సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడెమీ కరెస్పాండెంట్ సభ్యులు
పి. సిమొనోవ్ నరాలవ్యాధుల ఇన్‌స్టిట్యూట్
డైరెక్టర్‌తో యింటర్వ్యూ.

ప్ర: మీరు శాస్త్రజ్ఞులు. ఆత్మను గురించి మత పరమైన భావాలను మీరు అంగీకరించబోరు. అయితే కొందరు పదార్థవాద రచయితలు "ఆత్మ", "మనసు" అనే పదాలను ప్రత్యామ్నాయాలుగా వాడుతున్నారు. మనసు అనేదానిలో స్పృహలు, గ్రాహ్యతలు, భావాలు-మొత్తం మేధా కార్యకలాపాలతోబాటు అభీష్టం, మనో ద్వేగాలు యింకా యితరాలు వుంటాయి. అయినప్పటికీ మనం ఏమీ చదువుకోని గ్రామంలోని ముసలమ్మను ఆత్మభరితమైన వ్యక్తిగా పిలుస్తాం. పెద్ద చదువు సంస్కారం గల పెద్ద మనిషికి తెలివితేటలు మనోభావాలు లేనట్టుగా అతడిని ఆత్మలేని మనిషని పిలుస్తాం. కారణం?

జ: ఆత్మ, మనసు అనేవి రెండూ వేరు. మన కార్యకలాపాల వెనకగల శారీరక, సామాజిక, భావజాల ప్రేరణలలో ఆ తేడా వుంటుంది. మనం తరచు ఏమీ ఆలోచించకుండానే ప్రవర్తిస్తుంటాం. అలా ఎందుకు చేస్తాం అన్నది వివరించలేము. మన ప్రవర్తనను ఎప్పుడూ నిర్ధారించేది ఒకటుంది: అది ఆత్మ

పదార్థవాద దృష్టితో చూసినపుడు ఆత్మ, మానసికత — వీటికి ప్రాతిపదికగా ఉన్నత స్థాయికి చెందిన రెండు ప్రాథమిక నిర్దేశనలు వుంటాయి. మానసికత అంటె అర్థం తెలుసుకోవాలన్న నిర్దేశన. ఆత్మ అంటే విస్తృత మయిన సామాజిక నిర్దేశనలు. ఇతరుల కోసం నిర్దేశనలుగా వివరించ వీలున్నవి.

ప్ర: నిస్వార్థ పరోపకార వాదమనా మీ వుద్దేశ్యం?

జ: అవును. మన చుట్టూ వుండేవారికి మనమెలా వుపయోగపడాలి అనే ఆకాంక్షతో ఆత్మ అనే భావనను మనం సంధిస్తుంటాం. మానసికత అనేది మన ప్రజ్ఞానతా అభిలాషకు సంబంధించిన

భావాలకు చెందినది. ప్రపంచాన్ని అందులో మనస్థానాన్ని జీవితం అర్థాన్ని ప్రపంచంలో మన కర్తవ్యాన్ని తెలుసుకోవాలన్న ఆకాంక్షకు సంబంధించినవి.



**ప్ర: అంటే, ప్రజ్ఞానం, నిస్వార్థ పరోపకారత రెండూ కలిసిన పద్ధతి అన్నమాట. మరి మంచీ - చెడూల మధ్య ఘర్షణను దీనితో ఎలా పోలుస్తాం? అంటే ఎవరు మంచి మనిషి? ఎవరు చెడు?**




జ: మానవ స్వభావాన్ని గురించి ఎంతో క్షుణ్ణంగా తెలిసిన టాల్‌స్టాయ్ యీ రెంటికీ నిర్దిష్టమైన నిర్వచనం యిచ్చారు. మనుష్యులలో ఉత్కృష్టులైనవారు సొంత భావాలను యితరుల మనోభావాలను తమ ప్రవర్తనకు మార్గదర్శకంగా పెట్టుకుంటారు. యిక అతి నికృష్టులైనవారు తమ మనోభావాలను, యితరుల భావాలను తమ ప్రవర్తనకు మార్గదర్శకంగా పెట్టుకుంటారు. మానవ కార్యాచరణకు నాలుగు స్తంభాల ప్రేరణను ఆయన పేర్కొన్నారు. మనుష్యుల మధ్య తేడా యిందులోనే వున్నట్టు టాల్‌స్టాయ్ చూశారు. సగటు మనిషి యీ రెంటికీ మధ్యలో ఎక్కడో ఓచోట వుంటాడు.

సొంత భావాల మార్గదర్శకత్వం అంటే అర్థం ప్రజ్ఞాన కాంక్షను పొందడం. ప్రపంచం ఎలాఉంది? ఏదినత్యం? ఏది మంచి? నేనెవర్ని? యీ ప్రపంచంలోకి ఎందుకొచ్చాను? నాగమ్యం ఏమిటి? యిలా ప్రశ్నలు తనకు తానే వేసుకుని శోధించుకోవడం. ఇతరుల మనోభావాల మార్గదర్శకత్వం అంటే మన సామాజిక అవసరాల విషయంలో నిస్వార్థ పరోపకారత్వం కలిగి వుండటం. నికృష్టులైన వారు అహంభావయుతంగా వుంటారు. కేవల స్వార్థపరులుగా వుంటారు. తమ తీర్పులకు సత్యాన్ని కాక ఎరువు తెచ్చుకున్న భావాలను, తమ స్వార్థ ప్రయోజనాలను నెరవేర్చుకోవడానికి తోడ్పడే అభిప్రాయాలను ఆధారంగా వారు చేసుకుంటారు.

**ప్ర: సత్యం కోసం ఒక వ్యక్తి ఎంతటి నిస్వార్థంగానైనా అన్వేషించవచ్చు గాక. కాని ఆవ్యక్తి చేసిన పొరపాటుకు యితరులు పెద్ద మూల్యం చెల్లించుకోవాల్సి వస్తుంది. కాదంటారా?**

జ: మీరు చెప్పింది నిజమే. అందువల్లనే మేం మానవ ప్రవర్తనకు ప్రేరణల గురించి యింత



ప్రాధాన్యత నిస్తుంటాం. మహాకవి తాత్వికుడు గెటె యిలా అన్నారు: "ఒక గొప్ప మేధస్సుకు నేను తలవంచి నమస్కరిస్తాను. ఒక గొప్ప హృదయానికి నేను సాగిలపడి మొక్కుతాను."

**ప్ర: కల్పనా సాహిత్యంలో మనం యిలాటి మాటలు చూస్తుంటాం: "ఆత్మను తాకట్టు పెట్టడం", "తెలివైన హృదయం", "పాషాణ హృదయం", "అంధాత్మ", "నిర్దయ హృదయుడు" శాస్త్ర దృష్ట్యా యివి అలంకారిక పదాలేనా? అంధాత్మ వెలుగు చూడగలుగుతుందా?**

జ: ఇవి కవితాత్మక పద చిత్రాలు. మనిషిని, ప్రపంచాన్ని అధ్యయనం చేయడంలో కళకు, శాస్త్రానికి వేర్వేరు మార్గాలున్నాయి. అవి పరస్పర దోహదకారులేగాని ఒక దాని స్థానే మరొకటి వినియోగించడం కుదరదు.

మనోద్వేగాలు గుండెమీద ప్రభావం కలిగిస్తాయి అయితే "నీ గుండెను నమ్ము అది నిన్ను మోసం చేయదు" అన్న మాటకు అర్థం వేరు.



**ప్ర: "స్ఫూర్తిలో ఐక్యత" "సమిష్టి మనస్తత్వం" అనే పదాలు మనం తరచు ప్రస్తావిస్తుంటాం. అయితే "గుంపు మనస్తత్వం" అనే మరోపదం వుంది. సమిష్టి అనేది గుంపు అనే దానికి భిన్నమైనదని ఎలా చెప్పగలం?**

జ: వాటి లక్ష్యాలని బట్టి చెప్పగలం గుంపు లక్ష్యాలు సాధారణంగా ఆదిమమైనవిగా వుంటాయి. సమిష్టి బృందాలలో అత్యధికమైనవాటికి ఉన్నతమైన స్థాయి లక్ష్యాలుంటాయి. ప్రతి సముదాయానికీ ఒక సొంత నిర్మాణ స్వరూపం వుంటుంది. గుంపుతో పోలిస్తే ఒక సమిష్టి బృందానికి వుండే నిర్మాణ స్వరూపమూ, ఆర్గనైజేషన్ సూత్రాలూ పూర్తి భిన్నంగా వుంటాయి.

ఏ చిన్న బృందమయినా ఒక్క లాటిదేనని ఒక గ్యాంగ్ అయినా ఆర్కిటిక్ అన్వేషణకు వెళ్ళిన బృందం అయినా ఒకటేనని ఒకప్పుడు విదేశాలలోని మనస్తత్వ వేత్తలు భావించేవారు. అయితే అది తప్పు. ఒక బృందంగా చేరిన వారి లక్ష్యాలను బట్టి అవి పూర్తి భిన్నంగా వుంటాయి.

**ప్ర: కయ్యానికి కాలుదువ్వే దుందుడుకు స్వభావం మనిషికి పుట్టుకతోనే వుంటుందని పాశ్చాత్య ప్రపంచం అంతటా భావిస్తున్నారు. అది మన జన్యువుల్లోనే వుంది. అందువల్ల ఘర్షణలు తప్పవని వారంటారు. మరి మీరేమంటారు?**

జ: మనిషి సృష్టికి మకుటాయమానమే కావచ్చుగాని పరిణామ క్రమ సంతతితో జన్యురీత్యా సంబంధం గల మెదడు వున్న జంతువే. కజ్జాకు కాలు దువ్వే ప్రవర్తనకు మెదడు లోని కొన్ని ప్రక్రియలు కారణం. అయితే అవి యింకా అనేక ప్రక్రియలతో అనుసంధితమై వున్నాయి. కారణం లేకుండా దుందుడుకు తనంతో వ్యవహరించడం అనేది తీవ్రమయిన మానసిక రోగాల వల్లే తటస్థిస్తుంది.

**ప్ర: ఈర్ష్య చెడు గుణమా?**

**జ: ఆహా తప్పకుండా. అయితే ముందు యీ దుందుడుకు స్వభావం విషయం పూర్తి చేయనివ్వండి. కారణం లేని కౌమార దౌర్జన్యం గురించి మనం ఎప్పుడూ చెబుతూంటాం, అది సరికాదు. సమాజానికి లాభదాయకంగా ఆ అవకాశాన్ని వారు ఎలా తీర్చుకోవాలని అన్నది మనం నేర్పకపోతే వారు దౌర్జన్యం దుందుడుకు తనం ద్వారా ఆ పని చేస్తారు.**

ప్ర: సోవియట్ సమాజాన్ని ఆధునికంగా పునర్ని ర్మించేందుకు వేగంగా జరుగుతున్న 'మార్పుల దృష్ట్యా ప్రతి వ్యక్తీ మానసికంగా మరింత భారాన్ని వహించాల్సి వస్తున్నది. ఆలోచనల్లో పాత మూన పోతలు కుప్పకూలిపోతుండటంతో చాలా మందిలో ప్రతికూల వుద్వేగాలు ఏర్పడుతున్నాయి. నిపుణులుగా మీ వ్యాఖ్య ఏమిటి?

జ: ప్రతికూల ఉద్వేగాలు లేకుండానే సమాజ సంస్కరణ జరిగిపోతుందనుకోవడం భ్రమ. సాధించిన పురోగతితో ఆ తరువాత సంతృప్తి లభిస్తుంది. అయితే కాలం చెల్లిన ఆలోచనల మూసపోతలు ఎంత బలంగా వుంటే వాటిని బద్దలు గొట్టడం అంతకష్టం అవుతుంది. మనకు వచ్చే ప్రతికూల వుద్వేగాలు కూడా అంత ఎక్కువగా వుంటాయి.



ప్ర: వత్తిడి, అలసట అనేవి అందరూ చెప్పేంత భయంకరమైనవా? అదో పెద్దతొడేలని సులభ విజ్ఞాన శాస్త్రంలో చెబుతారు. గుండెపోట్లకు, కడుపులో అల్సర్లకు, నరాల వ్యాధులకు యింకా అనేక జబ్బులకు అదే కారణమని చెబుతారు. అంచేత ఏమైనాసరే యీ గ్లానులను తొలగించాలి. కాని ఎలా?



జ: గ్లాని గురించిన యీ దృష్టి పాక్షికమైనది. అకడమీషియన్ బెల్లాయెవ్ ప్రముఖ జన్యు శాస్త్ర నిపుణులు. శక్తిని మించి పని చేయడంవల్ల మనలోని సామర్థ్యాలు, తట్టుకోగల శక్తి వెల్లడవుతాయని ఆయన పేర్కొన్నారు. అంత శక్తి మనలో వుందా అని ఆ తర్వాత మనమే ఆశ్చర్యపోతాం. శక్తిని మించిన వత్తిడులవల్లే కోతి నుంచి మనిషికి అతి వేగంగా పరిణామం జరిగిన సమయంలో గుణాల పరిణామం జరిగిందని బెల్లాయెవ్ అభిప్రాయం. మామూలు పరిస్థితులలో తెలియని శక్తి సామర్థ్యాలను అతి వత్తిడి సమయంలో శరీరం ప్రదర్శించ గలుగుతుంది.

ప్ర: అయితే వత్తిడి వల్ల అనేక అనారోగ్యాలు ఏర్పడుతున్నాయని వైద్య శాస్త్రజ్ఞులు ముక్త కంఠంతో చెబుతున్నారు. దీనికి పరిష్కారముందా?

జ: వుంది. భావోద్వేగాలు అనేవి వాటంతటవే వుపయోగకరమూ కావు. హానికరమూ కావు అని ప్రయోగాల్లు రుజువు పరిచాయి. వాటికి కారణాలే మిటి అన్నది అసలు విషయం. క్రియాశీలమైన చురుకైన వైఖరులు సమాజానికి విలువైనవని చెబుతాం. అవి ఆ వ్యక్తి శరీరానికి కూడా అంతగానూ లాభదాయకమే. వ్యతిరేకమైన పరిస్థితి వచ్చినపుడు సాహసంతో ఎదురునిలవడం అత్యుత్తమం. కళాకారులు దీన్ని యెప్పుడో వూహించారు. వారు చెప్పిందినిజమని యిప్పుడు శాస్త్రజ్ఞులు అంటున్నారు.

(ప్రావ్దా సంక్షిప్తం)

# స్థిరత్వం లోపిస్తున్న యుగం

ప్రపంచ నాగరికతలో నిర్ణయాత్మక మార్పుపై ఒక శాస్త్రజ్ఞుని అభిప్రాయం

**అల్లకల్లోల పరిస్థితుల నుండి మానవ ప్రపంచం ఆవిర్భవించింది. యిది యెంతో సున్నితమైనది. తలెత్తున్న ప్రమాదాలు దీని జాడలు లేకుండా చేస్తాయి.**

**జెనెసిస్**

డాక్టర్ అస్కోల్డ్ సిలిన్

భూమిని తోక చుక్కలు, ఉల్కలు ఢీకొంటాయని చెపుతున్న ప్రమాదాల వల్ల లేదా తరచు సంభవిస్తున్న భూకంపాలు, యితర ప్రకృతి బీభత్సాల వల్ల మానవాళి తుడిచి పెట్టుకు పోయే ప్రమాదం వుండదు. యీ ప్రమాదం మేధావి అయిన మానవుని నుండే సంభవిస్తుంది. యితరులను ద్వేషించడం, చంపడం, లోబర్చుకోవడంమే కాకుండా తన సొంతజాతినే నమూలంగా నిర్మూలించే శక్తిమానవుని చేతిలో వుంది. వాస్తవంలో జరుగుతున్నదేమిటి?

## ప్రకృతి ఒడిలో

గతంలో జరిగిన ప్రకృతి బీభత్సాలు, యుద్ధాలు, సామాజిక, ప్రకృతి విపత్తులు అవి యెంతపెద్దవి, భయంకరమైనవి అయినా సరే స్థానిక మైనవిగా వుండినాయి. ఇవి ప్రాణాంతకమైన, ప్రపంచ వ్యాప్త మైన పర్యవసానాలను తెచ్చిపెట్టలేదు. కొన్ని వందల మిలియన్ల యేళ్ల క్రితం భూమ్మీద ఆవిర్భవించిన ప్రాణికోటి యిలాంటి ప్రమాదాలను తట్టుకొని నిలిచింది. సాధారణ పర్యావరణ, జనాభా పరమైన పరిస్థితులను పునరుద్ధరించుకొంది. మానవాళి ప్రగతికి బాటవేసుకొంది. మధ్యధరా సముద్రం ప్రాంతంల్లో, మధ్య, దక్షిణ అమెరికాలో సంభవించిన పెద్ద భూకంపాలు, మధ్యయుగంలో యూరప్‌లో సంభవించిన భయంకరమైన ప్లేగు, కలరా వ్యాధులు; తూర్పు యూరప్, మధ్యప్రాచ్యంలో ఆసియా కు చెందిన వారి దండయాత్రలు యిందుకు వుదాహరణ.

మన కాలంలోనే, కచ్చితంగా చెప్పాలంటే యీ శతాబ్దపు వుత్తరార్థం లోనే పరిస్థితులునాటకీయ్యంగా

మారాయి. మానవాళి, దాని సాంకేతిక కార్య కలాపాలు ప్రకృతిపై చెరగని, తీవ్రహానికరమైన ప్రభావాలను కల్గిస్తున్నాయి. అవి: పారిశ్రామిక వ్యర్థపదార్థాల వల్ల నానాటికీ పెరుగుతున్న నదుల, సరస్సుల, వాతావరణ కాలుష్యం; ఎడారిని బోలిన "చంద్రుని దృశ్యాల"ను దాపురింపజేసే విధంగా తగ్గుతున్న అడవులు, అనేక జంతు, వృక్షజాతులు సత్వరంగా అంతరిస్తున్న సందర్భాలు.

భూమ్మీద మానవునితో సహా మొక్కలు, జంతువులు మనడానికి అవసరమైన పరిస్థితులు యెంతనా జ్నాకైనవో జనసామాన్యానికి తెలియదు. ఉదాహరణకు, వాతావరణంలో ఆక్సీజన్ సాధారణ స్థాయి (21 శాతం) కన్నా కొంతశాతం తగ్గితే జంతువులు, కీటకాలు చనిపోతాయి. ఆక్సీజన్ శాతం కొద్దిగా పెరిగినా సరే పైరుపచ్చలు మలమల మాడిపోతాయి. సముద్రాల్లో ఉప్పు 3.4 నుండి ఆరు శాతం వరకూ పెరిగితే అవి మృతసముద్రాలైపోతాయి. వాతావరణంలోని కార్బన్ డైఆక్సయిడ్, ఆమోనియాల లోని మార్పు కూడా అంతకన్నా ప్రమాదకర పర్యవసానాలను తెచ్చి పెడుతాయి. సాంకేతిక పరమైన తీవ్ర అదుపులను విధించని పక్షంలో యీ సహస్రాబ్ది లోగానే వాతావరణంలో వీటి పరిమితులు, యితర ముఖ్యమైన పరామితులు అదుపుతప్పుతాయని వాతావరణ శాస్త్ర వేత్తల అభిప్రాయం.

సమతూకానికి లోబడి యెన్ని విన్యాసాలు చేసినా పరిస్థితి విషమించదు. వుదాహరణకు అలల పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని పడవను నడిపితే ప్రమాదం వుండదు. మన మనుగడకు అవసరమైన ఆక్సీజన్ పరిమాణం, వుప్పుల, యితర పదార్థాల స్థాయిలు సహజసిద్ధంగా మన యిష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా నిర్ధారితమైనాయి.
ఒక మిలియన్ సంవత్సరాల క్రితం భూమ్మీద మానవాళి వుద్భవించింది. యిన్నాళ్ళుగా భూమ్మీది బయటి విపత్తులనుండి మానవాళికి రక్షణ యిచ్చే స్థితిలో ప్రకృతి వుండింది. దీన్ని అర్థం చేసుకోవడం సులభమే. గతంలో ఒకమేరకు జరిగిన మానవాళి కార్యకలాపాలవల్ల వుత్పన్నమైన పర్యవసానాలను పరిహరించగల స్థితిలో ప్రకృతి వుండింది.

ఉదాహరణకు, పరమాణువును, యింకా కచ్చితంగా చెప్పాలంటే దాని కేంద్రకాన్ని విచ్ఛిన్నం చేస్తే శక్తిలభిస్తుంది. యిది అణుయుగంలోనే సాధ్యమైంది. అణ్వాయుధాలతో మారణహోమం, అణు వ్యర్థపదార్థాలతో మానవాళి తనను తాను విషపూరితం చేసుకోవడం మునుపెన్నడూ జరుగలేదు. పరమాణు కేంద్రక విచ్ఛిత్తి వల్ల అపారశక్తి సంపద లభ్యమవడమే కాకుండా అది అణ్వాయుధాలతో ప్రపంచాన్నే మట్టుపెట్టగల సంకట పరిస్థితిని తెచ్చిపెట్టింది.

రెండవది, జన్యు స్థిరత్వం. జడ ప్రకృతిలో పరమాణువు పాత్రనే మనశరీరంలో జన్యు నిర్వహిస్తున్నది. దీనికి బలమైన రక్షణ కవచాలున్నాయి. అందువల్లనే ప్రాణుల్లో యిది యెలాంటి పరిస్థితిల్లో (కొన్ని మినహాయింపు లున్నాయి) నైనా స్థిరంగ వుంటుంది. అంతే కాదు, తరతరాలుగా యిది చెక్కు చెదరకుండా వంశపారంపర్యమైన లక్షణాలను నిలబెట్టుకుంటోంది. అందువల్లనే శరీర నిర్మాణ శాస్త్రరీత్యా మనకూ, మనపూర్వీకుడైన గుహల్లో నివసించిన క్రోమాగ్నన్ మానవునికీ యేమంత తేడాలేదు.

జన్యును రూపాంతీకరించడానికీ లేదా దాన్ని "విచ్ఛిన్నం" చేయడానికీ సూక్ష్మస్థాయి జీవభౌతిక సంక్లిష్ట క్రమాలగురించిన ప్రగాఢ అవగాహన అవసరం. అంతేకాదు ఒక ప్రాణినుండి మరొక ప్రాణికి జన్యులను కచ్చితంగా మార్పిడి చేయడానికి చాలా సున్నితమైన సాధనాలు అవసరం అలాంటి అవగాహన, సాంకేతిక పరిజ్ఞానం యిటీవల వాస్తవరూపం ధరిస్తున్నాయి. యీ విధంగా మనం జెనెటిక్ యింజనీరింగ్ యుగంలో ప్రవేశిస్తున్నాం. యిది వైద్య, వ్యవసాయ శాస్త్రాల్లో విప్లవాత్మక అవకాశాలను సమకూర్చగలదు, దీనివల్ల చాలా త్వరగా ప్రాణుల నూతన రకాలను సృష్టించగల అద్భుత శక్తి మానవునికి లభిస్తుంది. కాని విచారకరమైన విషయమేమంటే అది మానవాళికి ప్రమాదాలను తెచ్చి పెట్టగలదు. యింత వరకు మనల్ని కాపాడిన రక్షణకవచం లేని స్థితిలోకి వెళ్ళిపోయే ప్రమాదాన్ని సృష్టించు కుంటున్నాం. యీ ప్రక్రియలో అమోఘమైన ఫలితాలే గాక అస్థిరత్వం కూడా పొంచివుంది.

చివరి వుదాహరణ. ను దీర్ఘ పరిణామ క్రమంలో ప్రకృతి మనలో నిరోధకశక్తిని పెంచింది. దీనివల్ల మనం రకరకాల వ్యాధులను తట్టుకొని నిలువగ లుగుతున్నాం. మానవున్ణితుడిచి పెట్టగల ప్లేగు, కలరా సూక్ష్మజీవులను కూడా యీ శక్తి నిరో ధించింది. యీ నిరోధక శక్తిని కృత్రిమంగా పెంచ డానికి ఇనాకులేషన్లు తోడ్పడ్డాయి.

ఈ భయంకరమైన వ్యాధులవల్ల ప్రాణాపా యంలేకుండా కొద్ది సంవత్సరాల క్రితం చేసుకున్నాం. కాని ఎయిడ్స్ అనేకనీవినీ యెరుగని వ్యాధి నెత్తి మీద పడింది. నిరోధకశక్తి దీని ముందు పని చేయదు. సహజసిద్ధమైన రక్షణ కవచమే లేక పోతే మానవుడు ప్రతిఒక్క వ్యాధికి సులభంగా గురి అవుతాడు. యిప్పటికే ఎయిడ్స్ కేసులు సుమారు **56,000** నమోదు అయ్యాయి. యిందులో **70** శాతం ప్రాణాంతకమైనవి. **1990** ల ప్రారంభంనాటికి యివి **1,000,000** లకు పెరుగుతాయని వైద్యసూచనలు తెలుపుతు న్నాయి. ఎయిడ్స్ సూక్ష్మజీవి అనేది జెనెటిక్ సాంకే తికజ్ఞత అవాంతర ఫలితమని, ఆసూక్ష్మజీవిని నిర్లక్ష్యంగా వదిలివేసిన దుష్ఫలిత మిదని కొందరి అభిప్రాయం. కాని అందుకు రుజువులులేవు. ఏదేమైనప్పటికీ పరిశ్రమలు వదిలే నీరువల్ల గాలి కాలుష్యం వల్ల, మానవుని లోని నిరోధక శక్తి యెంతో బలహీనపడింది. సహజమైన కారకాలవ ల్లె రక్షణ కవచాలు సిద్ధించాయని మనం భావిస్తు న్నాం. అయితే వాటిపై మన సాంకేతిక కార్యకలా పాల ఆచరణ దుష్ప్రభావం వుండదనుకోవడం పెద్ద పొరపాటు. ఐన్‌స్టీన్ సరిగ్గానే చెప్పాడు: దేవు డు (ప్రకృతి అని ఆయన భావన) అనుభవజ్ఞుడు; దురుద్దేశం గలవాడు కాదు. శాత్రవ ప్రకృతి శక్తు లు గుడ్డివి, మనగతిని అవి పట్టించు కోవు అని ఆయన అన్నారు. మానవుడు సర్వదా తనకు తానే భయంకర శత్రువు అనీ, బాహాటమైన శత్రువు అనీ యింకా అలాగే వున్నాడని చరిత్రలో జరిగిన యుద్ధాలు, హింస తెలియజేస్తున్నాయి.

మనకు అవరోధాలు, పూర్తిగా భిన్నమైన అవరో ధాలు యెదురౌతున్నాయి. యివి సామాజిక, మానసిక స్వభావంగల అవరోధాలని నా అభిప్రా యం. క్రూరుల, నీతి బాహ్యుల మాట అటుంచి దుష్ట, రాక్షస ప్రకృతి గలవారు అన్ని కాలాల్లో వున్నారు. వారివల్ల సమాజానికి ప్రమాద ముండింది. అయితే వారిలో యెవరు కూడా తమ ఘోరనేరాలతో సామాజిక ఉప్పెనలను సృష్టించ లేక పోయారు. కాని యీనాడు నీతిబాహ్యమైన చేష్టలవల్ల ప్రపంచానికి ప్రమాదం యెంతగానో పెరిగింది. వున్మాదులు, నరహంతకులు అన్ని రాజ్యాల స్థిరత్వాన్ని దెబ్బతీసే స్థితిలో వున్నారు. వీరు అంతర్జాతీయ ఘర్షణలను సృష్టించగలరు. యివి కథారచయితలు, సైన్స్ ఫిక్షన్ రచయితలు అపామాషీగా చెపుతున్న విషయం కాదు. ఇది భయంకరమైన వాస్తవం. వీరు కూడా మన కాలపు రాచపుండులాంటి టెర్రరిజం ముందు వెలవెల బోతున్నారు. యీ టెర్రరిజం పిల్లల, వృద్ధులతో సహా లక్షలాది అమాయక ప్రజలను పొట్టన బెట్టు కుంటున్నది.

ఈ అమానుష పరిణామానికి మూల కారణాలే మిటో జాగ్రత్తగా పరిశీలిస్తే కనిపిస్తాయి: నానాటికీ పెరుగుతున్న సామాజిక వత్తిడులు, సన్నిహితమౌ తున్న పరస్పరాశ్రిత జీవన పరిస్థితులు, ఒక ప్రమా దకరమైన దశకు అవి వుధృతంగా చేరుకుంటు న్నాయి. ఆ దశలో బుద్ధి పూర్వకంగానో, యాధృచ్ఛి కంగానో, చేసేనేరం వల్ల సృష్టి అయ్యే అగ్నికణం ప్రాణాంతకమైన అగ్నిప్రమాదంగా, ప్రేలుడుగా ప్రజ్వరిల్లి అనంతదూరాలకు సత్వరమే విస్తరి స్తుంది.

**ఈ విధంగా, మనకు యింతకాలం రక్షణని చ్చిన కవచాలు చరిత్రలో మొదటిసారిగా బలహీనప డ్డాయి, మొత్తంమీద పాక్షికంగా నాశనమయ్యాయి. అంతేకాదు, విస్తృతార్థంలో చెప్పాలంటే యీపరిస్థితి మొత్తం నిరోధక శక్తి వ్యవస్థను తీవ్ర ప్రమాదకర పరిస్థితిలోకి నెట్టుతుంది. వేరు మాటల్లో, మన నాగరికత ప్రమాదకరమైన అస్థిర యుగంలో ప్రవే శించిందనేది సుస్పష్టం.**

పరిసరాలపై పట్టును సంపాదించడానికి, దానిపై విజయం సాధించడానికి మానవుడు అమి తోత్సాహంతో చేస్తున్న కార్య కలాపాల ఫలితమేమన రక్షణకవచాలు బలహీనపడడానికి కారణం.

భూమి మన ఊయల: జీవితాంతమూ ఊయలలో యెవరూ వుండలేరు అని కన్‌స్తన్‌ తీన్ త్సియెలోవ్‌స్కీ ప్రవక్తలా చెప్పారు. యీ వూయలనుండి బయటపడడానికి, అంతరిక్షంపై విజయం సాధించడానికి శక్తి వంతమైన సాధనాలను సృష్టిస్తూ మానవుడు అదేసమయంలో యీ ఊయలను ధ్వంసం చేస్తున్నాడు. యీవిధంగా తన శక్తితోనే తననే నాశనం చేసుకుంటున్నాడు.

అందువల్ల మనల్ని మనం రక్షించుకోడానికి ఆలోచించాలి. బలహీనమైనవిగా, ఛిద్రాలున్నదిగా రుజువైన సహజ రక్షక కవచాలను తొలగించి వాటి స్థానంలో మన నాగరికతను విశ్వసనీయంగా రక్షించగల కొత్త కృత్రిమ కవచాలను నెలకొల్పుకోవాలి. శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాలు నిర్వహించాల్సిన ప్రధాన పాత్ర వున్నది యిక్కడే.

మన నుండి మనకు రక్షణ నివ్వగల, విజ్ఞాన శాస్త్రరీత్యా శక్తి వంతమైన చర్యలను ముఖ్యంగా మనం తీసుకోవాలని నా అభిప్రాయం. యింకా కచ్చితంగా చెప్పాలంటే మానవాళి మనుగడకు ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా ప్రమాదాన్ని సృష్టించే వివిడి వ్యక్తుల, సామాజిక బృందాల, మొత్తం రాజ్యాల కార్యకలాపాలపై పరిమిత లేదా సంపూర్ణ, తాత్కాలిక లేదా శాశ్వత నిషేధం విధించాలి.

ఇందులో వివాదానికి తావులేదు. మానవమనుగడకోసం మన ఆచరణలపై పరిమితులు విధించుకోవడం చట్టబద్ధమే. యిది చరిత్రలోని అన్ని యుగాల్లోని ముఖ్యాశంగా వుంది.

ఈ విధంగా ప్రజలు అనాది నుండీ తమ సమాజాన్ని దొంగల నుండి, హంతకుల నుండి యితర నేరస్థులనుండి రక్షించుకోడానికి చట్టబద్ధమైన రక్షణలను వినియోగించుకున్నారు.

బుద్ధి పూర్వకంగానో, యాదృచ్ఛికంగానో నాగరికతకు ప్రమాదం తెచ్చి పెట్టకుండా నిరోధించేందుకు తీసుకునే సరికొత్తచర్యలు, మనంగోతిలో పడకుండా, ప్రమాదాలకు గురి కాకుండా రక్షించే ట్రాఫిక్ రూల్స్ లాంటివే. అయితే ప్రతిపాదనలో వున్న పధకం యెంతో క్షుణ్ణంమైనది, కచ్చితమైన తనిఖీలకు వీలుకల్పిస్తుంది. అన్నిరకాల వున్మాదులు పాల్పడే చర్యకు వ్యతిరేకంగా అత్యంత విశ్వసనీయమైన రక్షణలను యిందులో పొందుపర్చాలి.

అదే సమయంలో మనం స్వయం చలిత సాధనాల పాత్రను అతిగా అంచనా వేయరాదు. స్వయం చలిత సాధనాలతో అధునాతన ట్రక్కును రోడ్డుపై నడిపించడంలో యిబ్బంది లేదు, కాని మొత్తం మానవాళిని ప్రమాదంనుంచి రక్షించేందుకు అత్యంత భాధ్యతాయుతమైన, సున్నితమైన, సంక్లిష్టమైన విషయాలపై నిర్ణయం చేయడానికి స్వయంచలితసాధనాలపై ఆధారపడవచ్చునని అనుకోవడం పసిపిల్లల అమాయకత్వమే అవుతుంది.

ఆవిష్కరణలు, నూతన కల్పనలు సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా విచిత్రమైన, వూహించని రీతిలో నెరపిన ప్రభావం అందరికీ తెలుసు. ఎంగెల్స్ పేర్కొన్నట్లుగా, అరబ్బులు సారాయితయారు చేయడం నేర్చుకున్నప్పుడు యిదే సారాయితో అప్పటి కింకా కనుగొనని అమెరికాలోని ఆదిమవాసులను నిర్మూలిస్తారని వారు వూహించలేదు; యూరప్‌లో యేనాడో అంతరించిన బానిస వ్యవస్థకు నీగ్రో వ్యాపారరూపంలో పునాదులు పడుతుతాయని అమెరికాను కనుగొన్నప్పుడు కొలంబస్ వూహించలేదు. అందువల్ల యిప్పటికీ బీజ రూపంలో ఉన్న నూతన కల్పనల చారిత్రక గమ్యాలను వూహించే అత్యంత సంక్లిష్టమైన కర్తవ్యాన్ని మనమెలా నెరవేర్చగలం?

## విజ్ఞాన శాస్త్రవేత్తల బాధ్యత

ఈ ప్రశ్నలకు చాలా సాధారణ రూపంలో సమాధాన మివ్వడానికి ప్రయత్నిద్దాం. శాంతి కోసం, నిరాయుధీకరణకోసం జరిగే రాజకీయ మతపరమైన లేదా యితర యేప్రచారం గానీ, ఆందోళనగానీ యిందుకు సరిపోదని నా అభిప్రాయం. ఢిల్లీ ప్రకటన స్ఫూర్తితో ప్రపంచ సామాజిక, ఆర్థిక పునర్ నిర్మాణం జరగాలనే గట్టి అభిప్రాయం వుంది.

యిందుకు సమాచార రంగంలో సాంకేతికంగా సాధించిన విప్లవాత్మక విజయాలు, సార్వత్రిక ప్రజా స్వామ్యం, బాహాటత, ఒక దేశ ప్రయోజనాలకన్నా ప్రపంచ ప్రయోజనాలు మిన్న అనే విధానం ప్రాతిపదికగా వుండాలి.

శాంతి వుద్యమాన్ని కూడా తదనుగుణంగా పునర్‌నిర్మించాలి. నాగరికత మనుగడ కోసం శాస్త్రీయ సూత్రాలను అభివృద్ధిచేసి, తదనుగుణ మైన సిఫార్సులను రూపొందించే ప్రధాన సమస్యపై చర్చజరపడానికి ప్రథమచర్యగా నిపుణులైన శాస్త్ర వేత్తల, ఇంజనీర్ల స్థాయిలో ఉపశమనవాదుల సమావేశాలను యేర్పాటు చేయాలి. యిలాంటి చర్చల నిర్ధారణలను, నిర్ణయాలను ప్రజలకు తెలియజేయాలి.

ఈనాడు ప్రపంచంలోని శాస్త్రవేత్తలు యెంత అనైక్యంగా వున్నారో నాకు బాగా తెలుసు. కాని స్వభావరీత్యా నేను ఆశావాదిని. అంతేకాదు, ప్రపంచంలో అనైక్యంగా వున్న మేధాశక్తిని తిరిగి ఐక్యం చేయడం ద్వారా మాత్రమే మన నాగరిక తను రక్షించు కోగలుగుతాం తప్పయిందుకు మరో మార్గంలేదని నాదృఢవిశ్వాసం.

ఈ ప్రాథమిక సూత్రాలు ఎంతో ముఖ్యమైనవి, అయినప్పటికీ యీకృషి విజయాన్ని యివే నిర్ధా రించలేవు. శాస్త్ర వేత్తల చేతుల్లో యిప్పుడు ఒక అమృతంపాత్ర, ఒక విషం పాత్ర వున్నాయని ఛార్లెస్‌స్నో సరిగ్గానే వర్ణించాడు. శాస్త్ర, సాంకేతిక రంగంలో పనిచేస్తున్న ప్రతి ఒక్కరి ప్రజాకార్యకలా పాల్లో, సృజనాత్మక కార్యకలాపాల్లో నైతికాంశం విడదీయరాని భాగంగా వుండాలని ఆయన అభిప్రాయం. శాస్త్రీయ పరిశోధన సామాజిక లక్ష్యా లు దాని మానవీయసారం ఒకే విధమైన ప్రాధా న్యతను, ఆవశ్యకతను, నిర్దిష్టతను సంతరించుకో వాలి. అప్పుడే అవి [illegible] లక్ష్యాల [illegible] మార్గాలుగా తోడ్పడుతాయి. లక్ష్యాలు, సాధ[illegible] నీతి, విజ్ఞాన శాస్త్రం; మాటలు, చేతలు [illegible] పరిపూర్ణ ఐక్యతకు "నాగరికత రక్షణ" (ప్రతిపాద నలో వున్న చికిత్స దిశలో వేసే తదనంతర అంజ) అనే ప్రపంచ విజ్ఞాన శాస్త్ర కార్యక్రమం తోడ్పడు గలదు.

అంతరిక్ష కార్య క్రమంలాంటి మానవాళి అభివృద్ధికి సంబంధించిన పురోగతిని,స్వయంగా విధించుకున్న యీ పరిమితులు నిరోధిస్తాయా? వేరుమాటల్లోచెప్పాలంటే యిది పిరికితనంతో మిగతా విశ్వం నుండి దూరంగా వుంటూ సంక్షే మాన్ని, భద్రతను యెంతో మూల్యం చెల్లించి కొనుక్కోవడం కాదా?

అలాంటి వాదనలలోని బలహీనత యిది: ప్రకృతితో మానవాళికి గల అభేద్యమైన సంబంధా న్ని వారు ఖాతరు చేయడంలేదు. యీ సంబంధం ప్రాధాన్యత మనకు నానాటికీ అవగతమౌతోంది.

ప్రపంచస్థాయినీతి: అంటే మన ఆచరణపై చైతన్యంతో పరిమితి విధించుకో వడమే. అది పరిసర ప్రపంచంలో నాగరికతను తుదకు సమరసంగా మేళవించడానికి తోడ్పడు తుంది. అర్ధశతాబ్ది క్రితం ప్రముఖ ఆదునిక తాత్వికుడు వ్లదీమిర్ వెర్నడ్‌స్కీ యిందుకోసమే విజ్ఞప్తి చేశాడు.

దీన్ని మానవుని తొలి పాపానికి ఒక గొప్ప విమోచన మార్గంగా ఆస్తికులు పరిగణించవచ్చు; కాగా భౌతిక వాదులు స్వేచ్ఛా ప్రపంచానికి దారితీసే అవశ్యమైన ఎరుకగా పరిగణిస్తారు.

విదేశాంగ విధాన సమస్యలు

ప్రపంచం లోని

ఉద్రిక్తతా ఆలవాలాలు

# కంపూచియా

## శాంతి జాతీయపునరుజ్జీవన పథంలో

ఎ. వోలిన్

కంపూచియా పీపుల్స్ రిపబ్లిక్ ప్రభుత్వం జాతీయ సామరస్య విధానాన్ని ప్రవేశ పెట్టింది. తద్వారా అది ఆర్థికాభివృద్ధి. వున్నత జీవన ప్రమాణాలు, జాతీయ సాంప్రదాయాలపట్ల, సంస్కృతి పట్ల గౌరవం — వీటిని సాధించడానికి ప్రయత్నిస్తోంది. పోల్‌పాట్ ప్రభుత్వ పతనంతర్వాత అన్నిరంగాల్లో సాధించిన గొప్ప పురోగతి యీ కృషిని ధ్రువీకరిస్తోంది.

### జాతి నిర్మూలన దుష్ఫలితాలు

పోల్ పాట్ ప్రభుత్వం 3,374,768 మందిని హత్య చేసిందని యీ ఘటనలను దర్యాప్తు చేసిన కమీషన్ తెలియజేసింది. దీని ఫలితంగా 141,848 కంపూచియన్లు బాధలకు గురయ్యారు. 200,000 మందికి పైగా అనాధలయ్యారు. ప్రభుత్వ దన్నుతో జరిగిన యీ హత్యాకాండ వల్ల జనాభా స్వరూపం మారి పోయింది. మొత్తంపౌరుల్లో స్త్రీలు 70 శాతం వున్నారు.

కంపూచియా ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమై పోయింది. 5857 పాఠశాలలు, 796 ఆస్పత్రులు, 1968 గుళ్లతో సహా సుమారు 634,522 భవనాలు శిధిలమై పోయాయి. దేశంలోని 100 ఫ్యాక్టరీల్లో 71 ఫ్యాక్టరీలను ధ్వంసం చేశారు. మేదావులను ఊచకోత కోశారు. వ్యవసాయరంగం విచ్ఛిన్నమై పోయింది. ఖ్మెర్ గూండాలు 1,507,416 పశువులను చంపారు. రబ్బరు తోటలను వరిపొలాలను నాశనం చేశారు

జాతని కాపాడాల్సిన తక్షణ కర్తవ్యం కొత్త ప్రభుత్వానికి యెదురైంది.

### సోషలిస్టు దేశాల సహాయం

సోషలిస్టు దేశాలు ముఖ్యంగా సోవియట్ యూనియన్, వియత్నాం యీ దేశానికి సహాయం చేశాయి అవి మందులను, ఆహారపదార్థాలను,



నామ్‌పెన్ లోని ప్రస్తుత పాలిటెక్నిక్ ఇన్‌స్టిట్యూట్
కంపూచియా లోని ఒక ఆసుపత్రిలో ఆపరేషన్ చేయడానికి సన్నాహాలు
చేస్తున్న సోవియట్ సర్జన్ ఎన్. షబాలిన్
ఒక హస్తకళాకారుడు
నామ్‌ఫెన్ విద్యుత్ కేంద్రంలోని కంట్రోల్ పేనల్



ఆటోమొబైల్స్‌ను, ట్రాక్టర్లను, యింధనాలను, యింకా నిపుణులను (వ్యవసాయ శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లు, డాక్టర్లు, టీచర్లు వగైరా) పంపాయి. వేలాది మంది కంపూచియన్ యువకులు సోవియట్ యూనియన్‌లో, వియత్నాంలో విద్య నభ్యసించారు.

## జాతీయ పునరుద్ధరణ

విద్యానంస్థలను ప్రజా ప్రభుత్వం తెరిచింది. నాంఫెన్‌లో రెండు సంవత్సరాలలోనే ఒక వృత్తి విద్యా పాఠశాల, వున్నత పాలిటెక్నిక్, వైద్య ఇనిస్టిట్యూట్, టీచర్స్ ఇనిస్టిట్యూట్‌లను అనేక పాఠశాలలను నిర్మించింది.

దేశంలో ఒక మిలియన్ మంది నిరక్షరాస్యుల్లో 70 శాతమందికి యిప్పుడు చదవడం, రాయడం వచ్చు, పిల్లల్లో 90 శాతం మంది పాఠశాలలకు వెల్తున్నారు.

కుప్పకూలిపోయిన జాతీయ ఆర్థిక వ్యవస్థ పుంజుకుంటోంది. పారిశ్రామికోత్పత్తి 1980 నాటికన్నా మూడు రెట్లు పెరిగింది. ధ్వంసం చేసిన ఫ్యాక్టరీలను మరమ్మతు చేశారు. యిప్పుడు దేశంలో కార్మికుల సంఖ్య55000

వ్యవసాయం వృద్ధి చెందుతోంది. 1987 జూన్‌లో 3,05,000 టన్నుల (సంవత్సరానికి తలసరి 280-350 కిలోలు) వరివండింది.1980 నాటికన్నా పశువులసంఖ్య రెట్టింపయింది. యిప్పుడు 36,000 హెక్టార్లలో రబ్బరుతోటలున్నాయి. అయితే రబ్బరు వుత్పత్తి యుద్ధపూర్వపు స్థాయికి యింకా చేరుకోలేదు, కాని కంపూచియా అవసరాలకు అదిసరిపోతోంది. బయటి సహాయంతో సాయుధ పోల్‌పాట్ ముఠాలు జరుపుతున్న దాడులను తిప్పికొట్టడానికి కంపూచియా ప్రభుత్వం తన వనరులను మళ్ళించక తప్పడంలేదు.

## విస్తృత ప్రజాస్వామ్యం, జాతీయ సామరస్యం

ప్రజాప్రభుత్వం తలపెట్టిన తక్షణ ప్రజాస్వామిక మార్పుల వల్ల పోల్‌పాట్ ముఠా ఆటకట్టింది. పౌరుల రక్షణకు, పౌరభద్రతకు హామీ కల్పించింది. యేమతాన్నైనా అయినా ప్రచారం చేసుకునే స్వేచ్ఛ కల్పించింది. స్థానిక సంస్థలకు, జాతీయ అసెంబ్లీకి 1981 వసంత రుతువులో స్వేచ్ఛాయుత, ప్రజాస్వామ్య పద్ధతుల్లో యెన్నికలు జరిగాయి. యీ అసెంబ్లీ కంపూచియా పీపుల్స్ రిపబ్లిక్ రాజ్యాంగ చట్టాన్ని ఆమోదించింది.

ప్రజల మద్దతుతో యీ నూతన ప్రభుత్వం తిరుగుబాటు దార్లను లొంగదీసుకుంటోంది. 1986 లోనే సుమారు 13,000 మంది తిరుగుబాటు దార్లను నిరాయుధులుగా చేయడం జరిగింది. అందులో 5000 మంది స్వచ్ఛందంగా ఆయుధాలను అప్పగించారు. గత మూడేళ్లలో మొత్తం మీద 10,000 మందికి పైగా తిరుగుబాటు దార్లు సాయుధ దాడులను మానివేశారు.

అంతర్యుద్ధాన్ని నిలిపివేసి, రాజకీయ సంప్రతింపులు. జరవడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంది. 1983 నుండి వియత్నాం వలంటీర్ల వుపసంహరణ దేశనుండి క్రమక్రమంగా జరుగుతోంది. 1987 లోనే 20,000 మంది వియత్నాం వలంటీర్లను దేశంనుండి వుపసంహరించడం జరిగింది. జాతీయ సామరస్యంపై వివిధ ఖ్మెర్ ప్రతిపక్ష బృందాలతో, విడివిడి వ్యక్తులతో సంప్రతింపులు జరవడానికి 1985 వేసవిలో ప్రభుత్వం తన సంసిద్ధతను ప్రకటించింది. జాతి నిర్మూలన విధానాన్ని అమలు జరిపిన పోల్‌పాట్ ముఠాను యిందుకు ఆహ్వానించలేదు.

కంపూచియా ప్రభుత్వం ప్రకటించిన జాతీయ సామరస్య విధానం వల్ల దేశసమస్యల పరిష్కారానికి నూతన అవకాశాలు ఆవిష్కృతమయ్యాయి. పోల్‌పాట్‌తో అయన గులాములతో తప్ప కంపూచియన్లందరితోను విస్తృత సంభాషణలు జరవడానికి యీవిధానం వీలుకల్పిస్తుంది. ప్రగతిశీలమైన, న్యాయమైన, సముచితమైన సమాజ నిర్మాణానికి కంపూచియా దేశభక్తులందరితో చిత్తశుద్ధితో కూడిన బాంధవ్యానికి యీ విధానం వీలు కల్పిస్తుంది. యిది యావన్మంది కంపూచియా ప్రజల శాంతియుత భవితవ్యానికి, సౌభాగ్యానికి తోడ్పడే విధానం.

ప్రాంతీయ ఘర్షణలకు స్వస్తిచెప్పి, సువిశాలమైన ఆసియా పసిఫిక్ మండలంలో స్నేహ, సహకారాలను స్థాపించే ఆశయానికి కంపూచియా ప్రభుత్వం నూతన నిర్మాణాత్మక ప్రతిపాదన గణనీయమైన దోహదం చేయగలదని సోవియట్ యూనియన్ భావిస్తున్నట్టు క్రెమ్లిన్‌లో కలుసుకున్న కంపూచియా విదేశాంగ మంత్రితో అధ్యక్షుడు అంద్రిగ్రోమికో అన్నారు.



# క్రైస్తవ మతాన్ని రూస్ స్వీకరించిన సహస్రాబ్ది వుత్సవ సన్నాహాలపై మెట్రోపాలిటన్ ఫిలారెట్ వివరణ

క్రైస్తవ మతాన్ని రూస్ స్వీకరించిన సహస్రాబ్ది వుత్సవ సన్నాహాలు రష్యన్ ఆర్థడాక్స్ చర్చికి సంతృప్తి కరంగా ఉన్నాయని మిన్‌స్క్, బైలో రష్యాల మెట్రోపాలిటన్ ఫిలారెట్ అన్నారు. ఆయన హోలీ సినోద్ శాశ్వత సభ్యుడు, మాస్కో పాట్రియార్చేట్ ఆధ్వర్యాన గల విదేశీ చర్చిలతో సంబంధాలు పెట్టుకునే శాఖ ఛైర్మన్. యీ వుత్స వాల కార్యక్రమంలో భాగంగా, మాస్కో సమీపంలోని ట్రినిటీ - సెయింట్ సెర్గియస్ లావ్రాలో 1988 జూన్ 6-8 తేదీల్లో రష్యన్ ఆర్థడాక్స్ చర్చి జనరల్ కౌన్సిల్ సమావేశం జరుగుతుంది. సోవియట్ యూనియన్‌లోని వివిధ మతాల ప్రతినిధులు, మాస్కోలోని పురాతన సెయింట్ డేనియల్ మఠంలో, పాట్రియార్చల్ ఎపిఫనీ కేథడ్రల్‌లో, యింకా కీవ్, లెనిన్‌గ్రాడ్, వ్లదీమిర్ చర్చిల్లో జరిగే ప్రార్థనలకు హాజరౌతారు. తర్వాత సోవియట్ యూనియన్‌లోని, విదేశాల్లోని ఆర్థడాక్స్ చర్చిల్లో వార్షికోత్సవాలు జరుగుతాయి.

రష్యన్ ఆర్థడాక్సు చర్చి వార్షికోత్సవం పట్ల మిహాయిల్ గోర్బచేవ్ కనబరుస్తున్న సుహృద్భావం తమకు సంతోషకరంగా వుందని ఆయన అన్నారు. యీ సందర్భంగా బైబిల్‌తో సహా యెంతో మతసా హిత్యాన్ని ప్రచురిస్తున్నామని ఫిలారెట్ అన్నారు. 1987 లో22 రష్యన్ ఆర్థడాక్స్ ప్రచురణలు ఐదులక్షల ప్రతుల్లో వచ్చాయని ఆయన అన్నారు. యింకా యెక్కువ ప్రచురణలను తీసుకరావాలనే కోరికవుందనీ, అయితే దేశంలో కాగితం కొరతను, ప్రభుత్వ ప్రచురణలను దృష్టిలో పెట్టుకొని యితర దేశాల్లోని ముద్రణాలయాల సేవలను వినియోగించుకుంటున్నామని ఆయన అన్నారు.

సోవియట్ యూనియన్‌లో కొత్తచర్చిలను, మఠాలను తెరుస్తున్నట్లు నొవొస్తీకి యిచ్చిన యింట ర్వ్యూలో ఆయన తెలియజేశారు. 13 వ శతాబ్దంనాటి సెయింట్ డేనియల్ మఠాన్ని మాస్కో, అఖిల రష్యా పాట్రియార్చ్ పిమెన్ అభ్యర్థనపై 1983 లో తమ చర్చికి అందజేశారని, అది రష్యన్ ఆర్థ డాక్స్ చర్చికి కొత్త పరిపాలన, మత కేంద్రంగా వుపయోగపడు తోందని ఆయన తెలియజేశారు. సోవియట్ యూనియన్‌లోని యూరపియన్ భూభాగ నడిబొడ్డున కలూగవద్దగల ఒప్తినావుస్తిన్‌ను, మాస్కోకు ఉత్తరానగల యారోస్లావ్ డయోసిస్ ప్రాంతానికి చెందిన తొల్గ్‌స్కీమఠాన్ని గత సంవత్స రాంతంలో చర్చికి అప్పగించారు.1987 లో 18 ఆర్థడాక్ సంస్థలను రిజిష్టరు చేయడం జరిగింది. అనేక చర్చిల మరమ్మతు చేయడం, పునరుద్ధ రించడం జరిగింది. కొన్ని చోట్ల గల పాతకర్ర చర్చిలను రాతితో నిర్మించడం జరిగింది.

మాస్కో, లెనిన్ గ్రాడ్, ఒదెస్సాల్లోని మత బోధనా పాఠశాలల్లో గత కొద్ది సంవత్సరాలుగా పేర్లను నమోదుచేసుకున్నవారి సంఖ్య గణనీయంగా పెరి గిందని మెట్రో పాలిటన్ ఫిలారెట్ తెలియజేశారు.

# సోవియట్ మార్కెట్టులో అపార అవకాశాలు



**వినోద్ మెహతా**

సోవియట్ యూనియన్ భారతదేశానికి అతిపెద్ద వాణిజ్య భాగస్వామి. యిరువైపులా జరుగుతున్న యీ వ్యాపారం 1986-87 లలో రు.4,000 కోట్లకు మించింది. 1953 లో యిది రు.1.30 కోట్లు మాత్రమే వుండింది.

భారతదేశం ప్రపంచ వ్యాప్తంగా చేస్తున్న వ్యాపారంలో సోవియట్ యూనియన్ వాటా 1985-86 లో 15 శాతం వుండిందని, 1970-85 సంవత్సరాల్లో భారతదేశ ప్రపంచస్థాయి వ్యాపారం సాలీనా 15.9 శాతం చొప్పున పెరగ్గా, సోవియట్ యూనియన్‌తో దాని వ్యాపారం 17.8 శాతం చొప్పున పెరిగిందని వాణిజ్య మంత్రిత్వ శాఖ పార్లమెంటరీ సంప్రతింపుల కమిటీ సమావేశంలో వాణిజ్య మంత్రి తెలియజేశారు.

### అపార అవకాశాలు

1992 నాటికి వుభయదేశాల మధ్య వాణిజ్య టర్నోవరును రు.10,000 కోట్లకు పెంచాలని 1986 నవంబరులో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి మిఖాయిల్ గోర్బచేవ్ భారత పర్యటన సందర్భంగా ఒక అంగీకారం కుదిరింది. ప్రస్తుత రు.4,000 కోట్ల వ్యాపార టర్నోవర్‌ను దృష్టిలో పెట్టుకొని చూస్తే యీ లక్ష్యాన్ని సాధించగలమా అనిపిస్తుంది. కాని వుభయపక్షాలకు రాజకీయ సంకల్పం వుంటే యీ లక్ష్యాన్ని సాధించడం కష్టమేమీ కాదు.

సోవియట్‌యూనియన్ లోని పెరిస్త్రోయికా, గ్లాస్‌నోస్త్ విధానం, భారతదేశంలోని వుదార ఆర్థిక విధానాలు, వీటికి తోడు భారతదేశ ప్రయివేటు రంగంతో ఆర్థిక సంబంధాలు పెట్టుకోవాలనే సోవియట్ యూనియన్ ఆకాంక్ష — యివన్నీ యిరువైపులా వ్యాపారాన్ని పెంచుకోవడానికి అపార అవకాశాలను సమకూర్చాయి.

ప్రస్తుతం భారతదేశం సోవియట్ యూనియన్‌కు టీ, కాఫీ, పుగాకు, జీడిపప్పు, పళ్ళరసాలు, వస్త్రాలు, చర్మపు వస్తువులు, రసాయనాలు, యంత్రాలు, విడిభాగాలు యెగుమతి చేస్తున్నది. సోవియట్ యూనియన్ నుండి ముడిచమురు, ఎరువులు,న్యూస్‌ప్రింట్, విద్యుత్, యితర యంత్రాలను, యంత్ర పరికరాలను దిగుమతి చేసుకొంటోంది.

వాణిజ్య వునాదిని విస్తరించుకోడానికి నూతన అవకాశాలు అన్వేషించాలి. అందుకే ప్రస్తుత వ్యాపారం స్వరూపాన్ని మార్చి వేయాల్సిన సమయం ఆసన్నమైంది. సోవియట్ యూనియన్ లోని కొన్ని పారిశ్రామిక, వ్యాపార సంస్థలకు విదేశాల్లో తమలాంటి పరిశ్రమలతో ప్రత్యక్ష సంప్రతింపులు జరుపుకొనే అవకాశంయిచ్చారు. దీన్ని వ్యాపార విస్తరణకు తోడ్పడే విధంగా వినియోగించుకోవాలి.

సోవియట్ యూనియన్‌కు ఎగుమతి చేయాల్సిన, సోవియట్ యూనియన్ నుండి దిగుమతి చేసుకోవాల్సిన, వస్తువులేమిటో తెలుసుకోడానికి భారత-సోవియట్ వాణిజ్య మండలి, ఇంజనీరింగ్ ఇండస్ట్రీస్ సమాఖ్య (సి.ఇ.ఐ),విదేశీ వ్యాపార విషయాల ఇండియన్ ఇనిస్టిట్యూట్ మార్కెట్ సర్వేలు జరుపు తున్నాయి.

### లాభసాటైన సంయుక్త పరిశ్రమలు

ఇలాంటి వాటిలో ఒకటి సోవియట్ యూనియన్‌లో హెూటల్, భోజన, పలహారాల పరిశ్రమ. మాస్కోలోని రెస్టారెంట్. యిలాంటి భారత-సోవియట్ మొట్ట మొదటి సంయుక్త పరిశ్రమ. యిందులో భారతదేశ వంటకాలను తయారుచేస్తున్నారు. ఎంపికసముచితమైనదిగా వుంటే సోవియట్ యూనియన్ అపారమైన లాభసాటి మార్కెట్‌ను సమకూర్చగలదని అక్కడ నెలకొల్పిన ఒకేఒక యీ సంయుక్త పరిశ్రమ భారతీయ వ్యాపారులకు నమ్మకం కల్గిస్తోంది. సమర్ఖండ్, బుఖారా, తాష్కెంట్‌లలో హెూటళ్ల నిర్మాణానికి భారతీయ కంపెనీలు యిప్పటికే అంగీకరించాయి. స్వాదుపానీయాల బాటలింగ్ కంపెనీని భారతదేశం అక్కడ యేర్పాటు చేయవచ్చు. సోవియట్ యూనియన్‌కు టి.వి సెట్లను ఎగుమతిచేసే సంయుక్త పరిశ్రమను భారతదేశంలో నెలకొల్పవచ్చు.

పైన పేర్కొన్న సంస్థలు మార్కెటు సర్వేలు జరుపుతున్నప్పటికీ నేనుకొన్ని వస్తువులకు గల మార్కెటును పేర్కొనదలచాను. యీ వస్తువుల ఎగుమతిని లేదా అమ్మకాన్ని ప్రత్యక్షంగా లేదా భారత దేశంలో సోవియట్ యూనియన్‌లో సంయుక్త పరిశ్రమల ఏర్పాటు ద్వారా లేదా సోవియట్ యూనియన్‌లో భారతదేశ సంయుక్త పరిశ్రమల యేర్పాటు ద్వారా వుత్పత్తిచేసి భారతీయ వ్యాపారాసంస్థలు లాభాలను పొందవచ్చు.

సోవియట్ యూనియన్‌కు యేటా పెద్ద సంఖ్యలో వినోద యాత్రికులు వెళ్లుతున్నారు యాత్రికుల సంఖ్య కనుగుణంగా హెూటళ్ళు లేవు. యిదివరకే నిర్మించదలచిన మూడు హెూటళ్లేకాక మరి కొన్ని హెూటళ్ళను భారతీయ పారిశ్రామిక వేత్తలు అక్కడ నిర్మించవచ్చు. తమ అనుభవం ద్వారా, పోటీకి నిలిచే నైపుణ్యం ద్వారా వారు ప్రస్తుతం చేస్తున్న వ్యాపారం కన్నా యెక్కువ వ్యాపారం చేయ వీలుంది.

### వినిమయ సరకులకు మార్కెట్

సోవియట్ యూనియన్‌లో వినిమయ

సరకులకు మంచి మార్కెట్ వుంది. వీటిలో ఫాషన్ దుస్తులు, సూట్‌కేసులు మొదలుకుని వినోదాన్నిచ్చే ఎలక్ట్రానిక్ వస్తువులు, పాఠశాలలకు, ఇనిస్టిట్యూట్లకు అవసరమైన పర్స నల్ కంప్యూటర్ల్ వున్నాయి. అన్నిరకాల సూట్ కేసులకు గల గిరాకీ సోవియట్‌లోని పరిశ్రమలు వుత్పత్తి చేస్తున్న దానికన్నా యెక్కువ వుంది. యిందులో యెక్కువ భాగం యితర సోషలిస్టు దేశాల నుండి దిగుమతుల ద్వారా తీర్చుకుంటున్నారు. భారత్‌లోని సూట్‌కేసుల పరిశ్రమ తగువిధంగా ప్రతిస్పందించి వీటి మార్కెట్‌ను కూడ లాభదాయకంగా వినియోగించుకోవచ్చు.

ఇక ఎలక్ట్రానిక్ వస్తువులకు సంబంధించి భారతదేశంలో సంయుక్త పరిశ్రమలను స్థాపించి వాటి వుత్పత్తులను సోవియట్ యూనియన్‌కు ఎగుమతి చేసే విషయమై చర్చలు చురుకుగా సాగుతున్నాయి. యిది అభివృద్ధి చెందుతున్న రంగం. యీ రంగంలో భారత పారిశ్రామిక వేత్తలు సోవియట్ సంస్థలతో సంయుక్త పరిశ్రమలను భారత్‌లోగానీ, సోవియట్ యూనియన్‌లోగానీ యేర్పాటు చేసి యెంతైనా లాభం పొందవచ్చు.

అలాగే అన్నిరకాల వాహనాల టైర్ల అమ్మకానికి అపార అవకాశాలున్నాయి. యీ విషయంలో సోవియట్ యూనియన్‌లో సరఫరాకు మించి గిరాకీ వుంది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లో ప్రత్యేకించి చలికాలం తక్కువరోజులు వుండే మధ్య ఆసియాలోని చిన్న పట్టణాల్లో రెండు చక్రాల బండ్లకు, (ముఖ్యంగా స్కూటర్ల మోపెడ్ల, అమ్మకాలకు అపార అవకాశాలున్నాయి. యీ విషయంలో గల మార్కెట్టు గిరాకీని వినియోగించుకోవడం భారత దేశ వుత్పత్తి దారుల ప్రతిభపై ఆధారపడి వుంది.

## నూతన ఆర్థిక దృక్పథాలు

సోవియట్ మార్కెట్ కోసం రష్యన్ భాషలో పుస్తకాల పత్రికల ప్రచురణ మరో లాభదాయకమైన పరిశ్రమ. సోవియట్ యూనియన్‌లో అంతా అక్షరాస్యులైనందున అక్కడి భాషలో ప్రచురించే పుస్తకాలకు అపారమైన గిరాకీ వుంటుంది. సోవియట్ యూనియన్‌లో అక్షరాలను కూర్చి వాటిని భారతదేశంలో ఆఫ్‌సెట్ ప్రెస్సులలో ముద్రించి సోవియట్ యూనియన్‌కు పంపవచ్చు.

భారత దేశ వ్యాపారులకు, పారిశ్రామిక వేత్తలకు సోవియట్ యూనియన్ అపారమైన మార్కెటు అవకాశాలను సమకూర్చుతున్నప్పటికీ, యీ విజయాలు సోవియట్ వస్తువులు, యంత్ర పరికరాల కొనుగోలు పై మాత్రమే ఆధారపడి వుండగలవు. వ్యాపారం రూపాయల ప్రాతి పదికపై జరుగుతుంది కాబట్టి యీ వ్యాపారం సోవియట్ యూనియన్‌కు లభించే రూపాయల వనరులపై ఆధారపడి వుంటుంది. అనేకసరకుల్లో సోవియట్ యూనియన్‌తో వ్యాపారానికి అనేక అవకాశాలున్నాయి. కాని దీనికి సంబంధించి సమాచారం లేనందున భారత వ్యాపారుల ప్రయోజనం పొందలేకపోతున్నారు. సోవియట్ యూనియన్‌లో రూపొందిస్తున్న నూతన ఆర్థిక దృక్పథాలు యీ సమాచార లోటును పూరిస్తాయనీ, భారతదేశంలో తమ వుత్పత్తులను సోవియట్ సంస్థలు అమ్మగలవనీ ఆశిద్దాం.

# సోవియట్ - భారత సంబంధాలు : నిన్న, నేడు, రేపు




హేమంత శైత్యమూ, గ్రీష్మతాపమూ ఒకే నిరాడంబరం
చొక్కా వేయడు పోలిక ఎండి వగ్గయిన హాలం
వెనకడుగు లేని పాదచారి అహోరాత్రం
మూపున మూట భారం.

సాయం సంధ్యారాగం ప్రభాత స్మేరం
సాగుతాడు కర్రవూతంతో నిరంతరం
నరితప్పని అంగలు స్థిరం
ఆయన మహాత్మ గాంధి సాగేనుదూర తీరం.

ఆగవు సాగును ఆయన పాదాలు సత్వరం
చేరి తీరాలి భవిష్య ద్వారం
వడి నడకల దాటును వేగం
సాగరాలు మేఘాలు హిమ శ్వేత శిఖరాల హారం

మనో శక్తి వృద్ధికి బలహీనమైతేనేం దేహం?
ఆత్మ దృఢం అయితే కండలేల - తానే సాక్ష్యం
గమిస్తున్నాడాయన ఢిల్లీ ప్రస్థానం
యీదుతూ కాలాలు వత్సరాలు సుదీర్ఘం......

ఎముకలు పొడిచిన నిటారు భుజద్వయం
సూర్యోగ్రతాప సైకతాల సాగే నగ్న పాదద్వయం
చిరిగిన నంచీ అనిపించును దుర్బలం
అయినా మోస్తున్నది భారత దేశాన్ని మొత్తం.

గమిస్తున్నాడాయన నిష్కామం
చూడు ఆ నేత్రాలు అగ్నిగోళ ద్వయం...
అడిగానాయన్ని 'గాంధి మహాత్మా చెప్పవా
నీవెవరు? స్ఫూర్తివా? మానవ మాత్రునివా?

స్ఫూర్తివే అయితే చెప్పవూ
ప్రజల గురించే ఎందుకు నీకీ వేదన?
చెరగ వెందుకు నీ వృద్ధ పాద ముద్రలు
చరిత్ర పొడి ఇనక తిన్నెల మీదన?

మరి అంటావా మానవ మాత్రుడినని
చుక్కల్లోకి వూహలు దూసే సాహసీ
తెస్తున్నావెందుకు అంతటి బరువుని
భారత సీమను యింత దూరం మోసీ మోసీ?

తీసుకెళ్తున్నావు యింతటి బరువు
ప్రకాశద్యుమణీ భవితవ్యానికి
చిరాకు పడవు విసుగుతో మూల్గవు
ఓర్మిని బాధ సహిస్తూ సాగే వేటటా ముందుకి".

నేననుకోని రీతి నిలిచారు గాంధి
చివరలు పగిలిన చేతి కర్రపై బరువు మోపుతూ
నా అస్పష్ట ప్రశ్ననే ఆలోచిస్తున్న పగిది
మిత్రుని వలె మెత్తగా మృదుహాసం చిందుతూ

అనంతర మంతర్ధానం...ఆ మూర్తి నిలిచిన చోట
ఆ నల్లని మోము, మెరిసే నయనాల తాన
నేచూశా పెరుగుతున్న గుబురు కొబ్బరితోట
ప్రకాశం ప్రగాఢం నీలికాంతులసోన

భారత భూమి:.....ఎంతటి ఆర్ద్రం, మానవీయం.....
అయింది నాకిక్కడ తేట తెల్లం
గాంధీజీ, భారత భూమీ సర్వదా ఏకం
కాలపు సమానార్థక ద్వయం అలాగే నిలుచు నిత్యం.



పుస్తక ప్రపంచం:

గియోర్గి జెలంకో

# రవీంద్రనాథ్ టాగూర్ "గీతాంజలి"




రష్యాలో టాగూరు "గీతాంజలి" తొలి ప్రచురణల్లో ఒకటి

టాగూరుతో సోవియట్ విద్యార్థులు 1930

ఒడెస్సా నగరంలోని గోర్కి ప్రభుత్వ వైజ్ఞానిక గ్రంధాలయానికి అనుబంధంగా ఏర్పడిన "అరుదయిన గ్రంధాల విభాగం" అధిపతి, ఓ చిరు పొత్తం నాకందించారు. రష్యాలో అంతర్యుద్ధం సాగుతూ వుండిన రోజుల్లో నదర్న్ యూనివర్సల్ లైబ్రరీ అనే ప్రచురణ సంస్థ ఆ పుస్తకాన్ని అచ్చు వేసింది. అది రవీంద్రనాథ్ టాగూర్ రచించిన సుప్రసిద్ధ కావ్యం — గీతాంజలి. ప్రస్తుతం యీ పుస్తకాన్ని యితర అరుదయిన గ్రందాలతో పాటు, గోర్కి గ్రంధాలయంలోని ప్రత్యేక విభాగంలో జాగ్రత్త చేశారు.

గీతాంజలి - రష్యాలో ఎంతో ప్రాచుర్యం పొందింది. 1914 వ సంవత్సరంలోనే గీతాంజలి నాలుగు సార్లు అచ్చయింది. ఆ తర్వాత పదే పదే పునర్ముద్ర పొందుతూ వచ్చింది. పెత్రోగ్రాద్ (ఈనాటి లెనిన్‌గ్రాద్), మాస్కో వంటి మహా నగరాల్లోనే కాదు — కూర్స్క్ లాంటి రాష్ట్ర స్థాయి నగరాల్లో సైతం గీతాంజలి అచ్చయింది. ఈనాడు విస్తృత

కవయిత్రి అన్నా రునోవ్స్కయ - ఖార్కోవ్ నగర వాసిని — సొంత వ్యాఖ్యానంతో గీతాంజలి అనువాదాన్ని ప్రచురించారు.

ఇవాన్ బూనిన్ సంపాదకత్వంలో వెలువడిన నికలాయ్ పుషేష్నికవ్ అనువాదం గీతాంజలి అనువాదాల్లో కెల్లా ఉత్తమ మయినదని పరిగణన పొందింది.

బూనిన్‌కు గీతాంజలి కావ్యమంటే ఎంత యిష్టమంటే, 1918 వేసవిలో ఆఖరిసారిగా ఆయన తన స్వస్థలం ఒడెస్సాకు మాస్కో నుంచి ప్రయాణమయ్యారు; అప్పుడు గీతాంజలి కావ్యాన్ని తనతోపాటే తీసుకు వెళ్లారు. 1918 జూలై 14 న ఆయన రాసిన యీక్రింది ప్రగాఢమయిన కవితలకు బహుశా, యీ కావ్యమే ప్రేరణ కలిగించిందేమో!

నీలి నీలి ఆకాశం — తేనెలొలికే పూలు
ఝుమ్మని పాడే తుమ్మెదలు
వండి ఒరిగిన కంకులు వచ్చని పచ్చిక
వెచ్చదనం, సూర్యుడి సువర్ణ రశ్మి
ప్రకృతి ఎత్తిన పునర్జన్మ!........

దారితప్పిన తన కొడుకును చూసి
దయామయుడయిన ఆ దేవుడు అన్నాడు కదా:
"తప్పు ఒప్పుకో — ప్రార్థన చెయ్యి
ఈ భూమి మీద నిజమయిన తృప్తి ఏమిటో
తెలుసుకో గలిగావా?
అన్నిటినీ మర్చిపోయి బంగారు పొంగారే
ఈ అనంత కేదారాలనూ ప్రశాంతతనూ
పరిరక్షించు!"

అప్పుడు నేను విలపిస్తాను —
ఆనందాశ్రువులు నా మాటలకు
అడ్డుకట్టలవుతాయి —
కృతజ్ఞతా పూర్వకంగా
ఆ కరుణామయుడి పాదాల ముందు
సాగిలబడి మొక్కుతాను.

(ఇంగ్లీషు అనువాదం : ఇరీన జెవేజ్నావ)




కె. మెలిఖాన్

విమర్శ పుట్టుకకు కారణమేమిటి? ఏ వుంది, విమర్శించాలనే బుద్ధి పుట్టడమే. ఏ విధంగా విమర్శించాలి? విమర్శఎప్పుడూ నిర్దిష్టంగా వుండాలి. ప్రతి ఒక్కరినీ — వాళ్ల పేర్లు పెట్టి — విమర్శించాలి. విమర్శకు భయపడే వాళ్లనీ, విమర్శించడానికి భయపడే వాళ్లనీ కూడా విమర్శించాలి.

విమర్శించే ముందు మీరు చెప్పబోయే విషయాన్ని క్షుణ్ణంగా విమర్శించుకోవాలి; విమర్శనాత్మకంగా సమీక్షించుకోవాలి.

మీ విమర్శను మీరే ధైర్యంగా విమర్శించుకోవాలి. మీ విమర్శ మీ లక్ష్యాన్ని ఛేదించు గాక!

అసలు విషయం విమర్శ కాదు — దాన్ని ఎలా తప్పించుకోవాలో సూచించే అంశమే ముఖ్యం.

విమర్శకు సందర్భం చాలా ముఖ్యం. అందరూ విమర్శిస్తున్నప్పుడే మీరూ విమర్శించాలి. ఎందుకంటే ఎవరూ విమర్శ ప్రారంభించక ముందే విమర్శించడం, లేదా అందరూ విమర్శించడం ఆపేసిం తర్వాత మీ విమర్శ ప్రారంభించడం, మిమ్మల్నే విమర్శకు గురి చేసే ప్రమాదం వుంది.

అసలు ఎలా విమర్శించాలో మనకి తెలీదు. మన విమర్శలు ఎలా వుండాలంటే, అవతలివాడు విని గిలగిలలాడి పోవాలి. అంచేతనే మన గురి ఏమిటో ఇతరులకు తెలియకుండా జాగ్రత్తపడడం — అక్కడికక్కడే యివన్నీ తేల్చుకోవడం విమర్శలో చాలా ముఖ్యం.

ఇంతకన్నా మంచి పద్ధతి యింకోటుంది. ఎవర్నీ ఎప్పుడూ విమర్శించకు. ముఖ్యంగా, విమర్శ అంటే ఏమిటో అందరికి తెలిసినప్పుడు మనం దేనిమీద విమర్శ చేస్తున్నామో, ఎంచేత దాన్ని మనం విమర్శించాల్సి వుందో అందరికీ తెలిసినప్పుడు — అస్సలు విమర్శించకుండా వుండిపోవడమే నయం. అసలు, ఎందుకూ యీ విమర్శ? ఎందుకంటే, ఎవర్నీ విమర్శించకుండా వుంటే మిమ్మల్నే విమర్శకు గురి చేస్తారు - అందుకు!

ఇతరుల విమర్శ నుంచి తప్పించుకోడానికి ఆత్మ విమర్శ ఉపయోగపడుతుంది. దీన్నే వేరే మాటల్లో చెబితే యీలా వుంటుంది — యితరులు ఆత్మ విమర్శ ప్రారంభించేంత వరకూ వారినే విమర్శించు!

చివరిగా ఒక మాట - మహత్తర విమర్శకుల రచనలు చదవడం — ఆ విమర్శకులను విమర్శించే లక్ష్యంతో చదవడం — విమర్శలో చాలా ముఖ్యమయిన విషయం. బహుశా — విమర్శ మీద రాసిన యీ వ్యాసాన్ని విమర్శనాత్మకంగా పరిశీలిస్తే యిది కూడా విమర్శకు పాత్రమే అని తెలుతుందేమో. ఇదంతా ఎందుకు జరుగుతో దంటే విమర్శకు సంబంధించిన మన భావాలు ఆత్మ విమర్శకు అతీతంగా విహరిస్తున్నాయి. ఆత్మ విమర్శకు అతీతంగా వుండేది ప్రతీదీ విమర్శకు పాత్రమే అవుతుంది.

విమర్శమీద విమర్శనాత్మకంగా రాసిన నా వ్యాసం యింతటితో సమాప్తం

## ప్రత్యేక సమాచారం

మే 18 మ్యూజియంల అంతర్జాతీయ దినోత్సవం. తమ తమదేశాల చరిత్రను, సంస్కృతిని పరిరక్షించుకోవాల్సిన అవసరాన్ని ప్రపంచ ప్రజల దృష్టికి తేవడమే యీ వుత్సవ లక్ష్యం. లెనిన్ గ్రాడ్ పరిసరాల్లోని కెథెరిన్ ప్యాలెస్ పునరుద్ధరణను ఫొటోలో చూడవచ్చు



### ఏడు దశాబ్దాల సోవియట్ పేయింటింగ్స్

పావెల్ కోరీన్ (1892-1967) ఇకాన్ పేయింటర్ కుమారుడు. మాస్కో పేయింటింగ్, స్కల్ప్చర్, ఆర్కిటెక్చర్ పాఠశాల పట్టభద్రుడు అయన యెన్నో పోర్ట్రెయిట్‌లను, చాలా పెద్ద కాన్వాసుల మీద చిత్రాలను వేశాడు. అయన చిత్రాలు వుత్తేజాన్నిస్తాయి. విభిన్న వర్ణ సమ్మేళనా భరితమైన ఆయన చిత్రాల్లో వైవిధ్యం కొట్ట వచ్చినట్టు కనిపిస్తుంది.

టూకీగా

Regd No. M. 8268

# టూాకీగా

పి. కోరిన్



"అలెక్సాంద్ర్‌నేవ్‌స్కీ" 1942
(ఈయన 13వ శతాబ్దంనాటి వీరుడు)



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M274 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | ya |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |